# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## మూడవ సంపుటము

## ఓంకారము

ప్రకాశకులు :

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001 వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం
1-3-2000 ప్రకాశకులు



ॐ

# విషయసూచిక

# శ్రీ గురుశ్శరణమ్

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షభిః"

అక్షరబ్రహ్మస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా!

"అక్షరం బ్రహ్మ పరమం" "ప్రణవస్సర్వవేదేషు" "గిరామస్మ్యేక మక్షరం" ఇత్యాది శ్రుతి స్మృతుల ద్వారా ప్రణవమహిమ వేనోళ్ళ వర్ణింపబడినది. సాక్షాదీశ్వర ప్రతిపాదకమగు ఈ ఓంకారమును ముముక్షువులందఱు ధ్యానింపవలయునని శ్రుతి స్మృతు లుద్ఘోషించుచుండ కొందఱు ఓంకారమును సర్వులు ఉచ్చరింపకూడదని నిషేధమును కల్పించి అడ్డుపడుచుండిరి. అట్టితరి బ్రహ్మీభూత శ్రీగురుదేవులు అట్టి అవరోధములను తొలగించి యథార్థమును ప్రకటించి మంత్రరాజమగు ప్రణవమును ముముక్షువులందఱు శ్రద్ధతో జపించి తరించవలయుననే సదాశయముతో ఈ 'ఓంకారము' అను ఉత్తమగ్రంథమును రచించిరి. శ్రీవారు ఎంతో పరిశ్రమ జేసి ఉపనిషత్తులలోని గీతాది స్మృతులలోని వివిధములగు ప్రమాణములను నిరూపించుచు, సర్వమంత్రములలో మూర్ధన్యమగు ప్రణవమును స్త్రీ పురుషాది, బ్రాహ్మణబ్రాహ్మణేతరాది, భేదము లేక అందఱును ఉచ్చరించవచ్చును అను యథార్థతత్త్వమును ఈ గ్రంథము ద్వారా వ్యక్తబఱచిరి, ప్రణవార్థమును ఇంత విపులంగ సర్వగ్రంథసారరూపముగ నిరూపించు గ్రంథము తెనుగున మఱియొకటి లేదన్న అతిశయోక్తి గాదు.

శ్రీవారు ప్రతికార్యక్రమారంభమున స్త్రీ పురుషాదులందఱి చేతను ఓంకారమును దీర్ఘముగా నుచ్చరింప జేయుచుండిన సంగతి అందరికిని విదితమే. ప్రణవోచ్చారణముచే మనస్సు ఎటుల శీఘ్రముగా అంతర్ముఖ మగునో దానిని ఇటుల ప్రత్యక్షముగ నందఱిచే ననుభవింపజేయుచుండిరి. "యథార్థభారతి"కి శీర్షస్థానీయము ఈ ప్రణవమే కదా! విషయవిరక్తులై అంతర్ముఖులగు ఉత్తమసాధకులకు ప్రణవధ్యానమునకు అత్యంత సహకారి

కాగలదు. శ్రీగురుదేవులు స్వానుభవపూర్వకముగ నీ ప్రణవ రహస్యము నిందు నిరూపించి సాధక లోకమునకు మహోపకార మొనర్చిరి.

చాలా రోజుల నుంచి యీ గ్రంథము దుర్లభముగా నుండెను. శ్రీగురుదేవుని దివ్యానుగ్రహముచే మఱల యిపుడు పాఠకలోకమున కందించు సదవకాశము లభించినది. కాన జిజ్ఞాసులైన భక్తులు దీనిని శ్రద్ధతో పఠించి ప్రణవానందము ననుభవింతురుగాక!

"ఓ మిత్యుపాసీత"

ఓం ఓం ఓం ఓం ఓం ఓం

శ్రీ సద్గురు సప్తమ పుణ్యారాధన
శ్రీ వ్యాసాశ్రమము
25-7-1969

ఓం
విమలానందస్వామి

ఓంతత్ సత్ ఓమ్

# పీఠిక

దైవాత్మ స్వరూపులై ఋషి సంతానములగు ప్రియమైన సోదరీ సోదరులారా! కరుణామూర్తియైన సర్వేశ్వరుని కరుణచే లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు, విజ్ఞానబోధయున్ను వర్ధిల్లును గాక! ఉపనిషత్తులలో నుండియు, యోగశాస్త్రములలో నుండియు, శ్రీభగవద్గీతాదులలో నుండియు, జ్ఞానవాసిష్ఠము నుండియు మన్వాదిధర్మశాస్త్రములో నుండియు, సూతసంహిత నుండియు ప్రణవోపాసనను గుఱించిన విషయమును సంగ్రహముగాను, ఉపాసనాయోగ్యముగాను, ఎల్లరును విశదముగా తెలిసికొనదగు విధముగాను ఈ గ్రంథమున సమకూర్చిన సంగతి పవిత్రాశయులందఱికిన్ని తెలిసిన విషయమే. అంతియేగాక ధ్యానము చేయువారికి ధ్యేయాకారస్థితి గల్గుటలో మహనీయుల అనుగ్రహముచేత గలిగిన కొన్ని రహస్యములనుగూడ దీని యందు విశదీకరించిన సంగతి సాధకులకు తెలిసియే యుండును. ఇంకను ప్రణవోపాసనను గుఱించి దీనిలో పేర్కొనని కొన్ని రహస్యములు ఇతర ఉపనిషత్తులలోను, యోగశాస్త్రములలోను, సంహితలలోను, స్మృతులలోను, గీతాదులలోను విస్తారముగా కనబడుచున్నవి. అయితే అవి యన్నియు వ్రాయబూనినచో గ్రంథము చాల విస్తారమగునని తలంచి విడిచిపెట్టడమైనది. కాని చూచినంతవఱకు దీనియందుగల అనుష్ఠానమునకన్న ఎక్కువ మార్గమేమియు వాటి యన్నిటిలో కనుపించుటలేదు. అవి వేరు వేరు ఋషులను, యోగీశ్వరులును, సిద్ధపురుషులును వ్రాసినందుచే ఈయొక్క విషయమునే వేరు వేరు విధములుగా విశదీకరించిరని పాఠకులకు గోచరించగలదు. అయినను ఈ ప్రణవోపాసన విషయమై ముముక్షువులు ఇంకను దెలిసికొనదగిన విషయములేవైన యుండినచో లోకపావన తత్పరులగు మహాపురుషులు వానిని తెలుప సవినయముగా కోరుచున్నాను. అంతేగాక ఈ గ్రంథమందుగూడ ఎచ్చటైన పొరబాటు గలిగియుండినచో అదిన్ని నాపై కరుణ గలవారలై

దెలుపకోరిక గలవాడను. అది లోక మంగళ కారణహేతువగునని తలంచెదను. వాటి నన్నిటిని పరమపూజ్యభావముతో పరిశీలించి మరు ముద్రణములో చేర్చగలుగుదును. ఏ విధమైనను, బద్ధుల బంధ విమోచనమును, కర్మజీవుల కర్మరాహిత్యమును, ముముక్షువులకు ముక్తియును, అస్వతంత్రులకు స్వాతంత్ర్యమును, దుఃఖజీవులకు సౌఖ్యమును గలిగిన చాలును అని మాత్రమే యీ యుపాధిలో గల వ్యక్తికి విచారము గలుగుచున్నది. దీనివలన గలిగెడు ఆపత్తులన్నియు సంపత్తులనియు, కష్టములన్నియు సుఖములనియు, దూషణములన్నియు భూషణములనియు మాత్రము హృదయములో దృఢ ముగా భావన గలిగియుండే లాగున పరమకారుణికుడగు సర్వేశ్వరుడును పరమ పావనులగు మహర్షులును సదా అనుగ్రహింతురు గాక! ఆఖరుకు దీనివలన మృత్యువు గూడ తటస్థించినను అది అమృతమువలెనే యుండులా గున హృదయములో అచంచలమైన భక్తి భావము గల్గునుగాక! అనగా అమృతమైన యీ దైవకార్యమందు మృత్యువు గలిగినను అది అమృతమే యగును. అది శుభ ప్రదము. శివము.

2. సర్వేశ్వరుడు లేక పరమాత్మ, పరబ్రహ్మము సర్వవ్యాపకమై , శుద్ధమై, గుణత్రయరహితమై, అద్వయమై, శివమై, అఖండమై, అమృతమై, జ్ఞానమై, చిజ్జ్యోతియై, సర్వకారణమై, తన ఆత్మయై వెలుగుచున్నదని ఉపనిషత్తులు దెలుపుచున్నవి. ఇది నిజమైనచో అట్టి బ్రహ్మము నుపాసించుటకు లేక ఆరాధించుటకు లేక ధ్యానించుటకు లేక అనుసంధించుటకు లేక పూజించుటకు ఓంకార మొక్కటియే ముఖ్య సాధనమై యుండవలయును. తక్కిన మూర్తి ధ్యానములన్నియు దీనియందు లయమొందియే తీరవలయును. ఈ యోంకారము సముద్రము వంటిది. తక్కిన మూర్తి ధ్యానములన్నియు నదీ నదముల వంటివి. నదీ నదములన్నియు సముద్రములో లీనమగునుగాని సముద్రము నదులలో లీనము కాదు కదా! లేక ఓంకారము సూర్యునివంటి ప్రకాశము గలది. తక్కినవి చంద్ర నక్షత్ర దీపాదులవలె నుండును. కనుకనే సర్వదేవీ మంత్రములకును, సర్వదేవతా మంత్రములకును ముందుగా ఓంకారమును అనుసంధించి జపించుటకును పూజించుటకును

అర్చించుటకును కారణము. దీనివలన ఈ సర్వమంత్రములకు ప్రణవమే మూలమనియు, ప్రాణమనియు తెలిసి కొనవచ్చును. కనుకనే ''సర్వేషామేవ మంత్రాణాం ప్రణవః ప్రాణముచ్యతే '' అనగా సమస్త మంత్రములకును ప్రణవమే ప్రాణమై యున్నది అని సూతసంహిత చెప్పుచున్నది. ప్రణవము లేని మంత్రము ప్రాణశక్తి లేనిదని గ్రహించవలెను. అంతేకాక మంత్రములన్నిటికిని ప్రణవము ఆదిగా నుండుటచే ప్రణవమునుండియే ఈ మంత్రాధిష్ఠాన దేవతలన్నియు ఏర్పడినవని గ్రహించవలయును. మరల యీ దేవతలందరు ప్రణవమునందే లీనమగుచుందురు. కనుకనే దీనికి అక్షరమని పేరు గల్గినది. ఇది అక్షరమని వేదమంగీకరించినచో తక్కినవన్నియు క్షరములని చెప్పుటలో ఏల సందేహింప వలయును? ''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'' (గీత. అ 8.) అని శ్రీకృష్ణ భగవానులును చెప్పుచున్నారు. ''అక్షరం పరమం బ్రహ్మ'' ''ఓమిత్యే కాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః'' ఈ లాగున తేజోబిందూపనిషత్తు కూడా ఉద్భోధించుచున్నది. అది సత్. అది యొక్కటియే శాశ్వతముగా నిలుచును. తక్కినవనియు కాలాంతరములో నశించును. కనుకనే బృహదా రణ్యకోపనిషత్తు 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్'–బ్రహ్మోపదేశము కొరకు వచ్చియుండు ఓ సౌమ్యశీలుడా! సృష్టికి ముందు ఆ సత్తామాత్ర మొక్కటియే యుండెను అని చెప్పినది. అదే సత్. అది సత్తని చెప్పుటచే తక్కిన వన్నియు ఆ సత్తని యేల గ్రహించకూడదు? అయితే ఓంకారోపాసకునకు కొన్ని పవిత్రగుణము లుండుటవలయును. అవి యీ గ్రంథములో గల గీతా విషయమున చూడదగును. ఇట్టి చిత్తైకాగ్రతయు, చిత్త నిర్మలత్వమును గలుగనివారు ప్రణవముతో గూడిన యితర మంత్రములను గూడ ధ్యానింప వచ్చును. నదులను ఆశ్రయించి ప్రయాణము చేయువారు క్రమముగా సముద్రమును చేరునట్లు అవి కాలాంతరమున ప్రణవస్వరూపుడైన పరమాత్మను చేర్చును. దీనిని క్రమముక్తియనియు, ప్రణవోపాసనను సాక్షాన్ముక్తియనియు జెప్పుదురు. అయితే ప్రణవము యొక్క శబ్దము రహితము చేయవలయును. ప్రణవార్థమగు శైవము ధ్యేయాకారమై నిలువవలయును. ఏలన శబ్దము పంచభూతాత్మకములో ఆకాశతత్వము. ఇది

ప్రకృతితో గూడియే యుండును. దీనిలోనుండు వాడు ప్రకృతిని దాటజాలడు. ప్రకృతిలో నుండువరకు దానియొక్క వికృతులు గూడ కల్గుచుండును. కనుకనే మంత్రము, మంత్రార్థము మంత్రరహస్యములనెడు రహస్యత్రయము తెలుసుకొనవలయుననియు, ప్రసాదత్రయము గ్రహించుచుండవలయుననియు శాస్త్రము చెప్పెడు పరమ రహస్యము. దీనినే త్రివిధ ప్రసాదమని చెప్పుదురు. మరల మంత్రరూపము, మంత్రస్థానము ఉండవలెనని కొందరు చెప్పుదురు. ఈ రెండును భావము మాత్రమేగాని మరియేమియు లేదు. పై జెప్పిన మూడును సత్యములు; గ్రహించదగినవి. ఈ విషయమై గీత అష్టమాధ్యాయమున శ్రీకృష్ణభగవాను లుపదేశించియున్నారు. పిపీలికా మార్గమనియు, విహంగ మార్గమనియు దీనికి నామాంతరములు గలవు. ఈ ప్రణవోపాసన లేనివారికి ఖండజ్ఞానము నశించి అఖండ జ్ఞానము గల్గుటకును, వ్యష్టిజ్ఞానసాక్షిత్వము లయించి సమష్టి జ్ఞానసాక్షిత్వము లభించుటకును, స్వరూపముక్తి నుండి అరూపముక్తి లోనికి ప్రవేశించుటకును, సవికల్ప సమాధినుండి నిర్వికల్ప సమాధిలోనికి వెళ్ళుటకును, వాచ్యము నుండి లక్ష్యములోనికి పోవుటకును, జ్ఞానము లయమునొంది జ్ఞేయాకారము గలుగుటకును, ధ్యాత ధ్యేయాకారమై మారుటకును, మృత్యువునుండి అమృతత్వము లోనికి ప్రవేశించుటకును, తమస్సునుండి జ్యోతిస్సులోనికి కలియుటకును, అసత్తునుండి సత్తులోనికి ఐక్యము చేసుకొనుటకును, తురీయము నుండి తురీయాతీతములోనికి మరలుటకును, జీవన్ముక్తినుండి విదేహముక్తి లోనికి దూకుటకును వేరు మార్గము లేదు. అయితే యివి యన్నియు ప్రణవము యొక్క శబ్దము కాదు; శబ్దార్థమని జ్ఞాపకములో నుంచవలెను. అచ్చట మాత్రమే ప్రకృతి లయమైయుండును. కనుకనే యోగశాస్త్రమును, జ్ఞానశాస్త్రములగు ఉపనిషత్తులును ఓంకారోపాసన నుపదేశించెడు రహస్యము. ఏలన యే మంత్రము దంతోష్ఠతాలుజిహ్వల సహాయముచే నుచ్చరింపబడుచుండునో, అట్టి మంత్రమునకు ప్రకృతి రహితావస్థను ఒనగూర్చ శక్తి చాలదు. ఈ గ్రంథములో గల ఉత్తరగీత వ్యాసమును జూడుడు. మనుస్సు స్మరణ జేయునప్పుడు గూడ సూక్ష్మ

ప్రకృతితో గూడియుండును. కనుకనే వాచకజపమున కన్న వెయ్యిరెట్లధిక ఫలము ఉపాంశు జపమునకును, ఉపాంశువు కన్న వెయ్యి రెట్లధిక ఫలము మానసమునకును, దానికి పైనుండు దానికి ఫలమనంతమనియు యోగశాస్త్రములు చెప్పెడు రహస్యము. ఈ గ్రంథములోగల మనుస్మృతి వాక్యము జూడదగును. ప్రణవ మొక్కటి మాత్రమే దేహత్రయ, జీవత్రయ, అవస్థాత్రయ, కాలత్రయ, గుణత్రయముల పై భాగమునకు వెళ్ళుచుండును. మరియు ఏ మంత్రము జపమొనర్చునప్పుడు ఎవరికి ఊపిరి క్రిందికి తిరుగుచుండునో, అట్టి నిష్ఠ గలవానికి పునర్జన్మము సిద్ధము. అనగా ఏ మంత్రమునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు లయము గాలేదో దానికి జీవేశ్వరైక్యము లేదు. లెస్సగ విచారించిన సోऽహంమంత్రముయొక్క సకారమును హకారమును లయమొందిన ఓంకారమే మిగులచుండును. అయితే యిది వాచ్యము గాదు! లక్ష్యమని గ్రహించవలయును. ఏలన ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుచుండువరకు మాత్రమే 'సోऽహం మంత్ర' మనెడు హంస మంత్రము నిలుచును. అహం శబ్దార్థము జీవత్వము. తచ్ఛబ్దార్థము ఈశ్వరత్వము. శుద్ధ మాయాప్రతిబింబుడు ఈశ్వరుడనియు, మలిన మాయా ప్రతిబింబుడు జీవుడనియు వేదాంతశాస్త్ర సిద్ధాంతము, దీనిని ఉపాధిద్వయ మని చెప్పుదురు. ఉపాధిద్వయరహితము ప్రబోధ బ్రహ్మ సాక్షాత్కారము. అదే పూర్ణత్వము. సోऽహంమంత్రము ఇడా పింగళనాడుల ద్వారా సంచరించును. వీరికి సుషుమ్నాగ్రము అవగాహనము కాలేదు. అంతేగాక సూర్యచంద్రుల గమననాడులని వీనికి పేర్లు. సూర్యచంద్రులు కాలచక్రమునకు లోబడినవారు. ఇచ్చట అగ్ని నాడిని నిరూపించలేదు. అదే కర్మ కట్టెలను దహింపజేయును. అయితే యిట్టి అభ్యాసము చిత్తము యొక్క నిలకడకొరకు చాలా ఉపయోగపడును. వీనికే సోऽహమనియు, త్రిప్పునప్పుడు హంసోऽహ మనియు పేర్లు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు కొంచెము సేపు నిలబెట్టిన మరల మిగిలియుండునది యెద్దియో దానిని కనుగొనిన చాలును. ధన్యాత్ములగు దురు. శివత్వమును అమృతత్వమును వీరికి గల్గును. హల్లు అక్షరములకు అచ్చు అక్షరములు చేరునప్పుడు కా, కి యీలాగున ఏర్పడుచుండును. అనగా

'క్' అను హల్లునకు 'అ' కలియునప్పుడు క అనియు, 'ఆ' దీర్ఘము వచ్చునప్పుడు 'కా' యనియు 'ఇ' గుడి కలియునప్పుడు 'కి' అనియు, 'ఉ' కొమ్ము కలియునప్పుడు 'కు' అనియు అక్షరములు యేర్పడుచుండును. ఇది అన్ని అక్షరములకు వరుసగా వచ్చుచుండును. అప్పుడు 'సా' కు ఓత్వము వచ్చునప్పుడు 'సో' ఏర్పడుచుండును. ఇట్టి 'సో' తో 'హం' చేరునప్పుడు 'సోఽహ' మగుచుండును. ఇప్పుడు సకారమునకు, హకారమునకు మధ్య ఓంకారము లీనమైయుండును. ఇదే సోఽహములో మనము గ్రహించవలసిన రహస్యము. మరియు ఓంకారము తప్ప తక్కిన మంత్రముల నుపాసించు వారికి భేదజ్ఞానము నశించి అభేద జ్ఞానము కలుగదు. కనుకనే శైవులకును వైష్ణవులకును, శాక్తేయులకును, సౌరులకును, గాణాపత్యులకును, క్రైస్తవులకును, మహమ్మదీయులకును, బౌద్ధులకును భిన్న భిన్న భావములు గలుచున్నవి. అంతేగాక ప్రణవోపాసన పరమగు పరబ్రహ్మోపాసకులకు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సమస్త ప్రాణులను, మనుష్యులను, దేవ తలను, ఋషులను భక్తితో పూజించిన ఫలమును, శివకేశవాది త్రిమూర్తులను ఆరాధించిన ఫలమును, తృణము నుండి మేరుపర్యంతము గల అచేతనత్వములో నుండు వస్తువులను పూజించి సేవించిన ఫలమును గలుగును. ఏలన వారు ధ్యానించునప్పుడు చరాచర ప్రాణికోట్లలో గల చైతన్యమునే ఆత్మభావముతో ధ్యానించుచున్నారు. కనుక జెప్పిన దంతయు వీరిని అనుగ్రహించుచుండును. ఈలాగున ధ్యానము చేయువారికి పైజెప్పిన వన్నియు హితము చేయునేగాని అహితము చేయవు. అంతేగాక, అట్టి ధ్యాననిష్ఠునికి పైజెప్పిన దేవతలందరును, అచేతనములును వశవర్తులై యుందురేగాని, వ్యతిరిక్తులై ఏ కార్యమును చేయరు. కనుకనే బ్రహ్మవేత్తలకు లోకమంతయు వశపడుటకు కారణము. అయితే ధ్యానములో అలాటి అవస్థ పొందవలయును. అప్పుడు పంచభూతములు గూడ వీరికి వశవర్తులైయుం డును. వేరు భావముతో శివకేశవాదులను గాని, ఇతర దేవతలనుగాని ధ్యానించు వారికి ఆయా దేవతల అనుగ్రహము కలుగవచ్చునే గాని సర్వదేవతల అనుగ్రహము గల్గుట కవకాశము లేదు. వేర్వేరు దేవతలను ధ్యానించువారు

ప్రత్యేక ప్రత్యేకముగా దీపమును వెలిగించినవారే యగుదురు. సర్వాంతర్యామియైన పరమాత్మను ఆత్మభావముతో నుపాసించిన విద్యుద్దీపయంత్రమును వెలిగించునట్లుండును. విద్యుచ్ఛక్తి యంత్రము యొక్క మొదటి యంత్రమును త్రిప్పిన ఒకేసారి అన్ని దీపములును ప్రకాశించును గదా! చిన్న పెద్ద యంత్రములన్నియు చలించుచుండును గదా? అట్లే పిపీలికాది బ్రహ్మపర్యంతము గల బ్రహ్మాండములో అంతర్యామియై చైతన్య స్వరూపుడై వెల్గుచుండు పరబ్రహ్మమొక్కటియే. ఆయా మతస్థులవా రుపాసించు దేవదేవుడే దైవమని చెప్పునది నిజమైనచో, అట్టి పరబ్రహ్మమునకే వారి వారి మతములలో చెప్పుచుండు దైవవాక్య నిర్వచనము సిద్ధించును. ఇది యెరింగినచో కలహమునకు భేదమునకు మార్గముండదు. లేక సమస్తమునకు మూలకారణమగు బ్రహ్మమును ఓంకారముతో నుపాసించువారు గొప్ప వృక్షముయొక్క మూలములో జలము పోసినవంటి వారగుదురు. వేర్వేరు దేవతలను ధ్యానించువారు వృక్షము యొక్క శాఖోపశాఖలను బోషించినవారే యగుదురు. లేక శ్రీశివ, శ్రీమన్నారాయణ, శ్రీరామ మొదలగు మూర్తులపై ప్రేమగల వారు మరియు ధ్యానించువారు చరాచరములలో వెల్గుచుండు చైతన్య స్వరూపము తనయొక్క యిష్టదైవమని తలంచిన చాలును. దీనియందు గూడ మంచి సౌఖ్యము గల్గును. అయితే యితర మతస్థులు చెప్పు దైవవాచకముగూడ తనయొక్క యిష్టదైవ నామధేయమే అని గ్రహించవలెను. భాషమార్పేగాని భావవస్తువులలో మార్పు లేదని గ్రహించిన చాలును. అట్లు గానిచో ఇట్టి భక్తులుగూడ ఒక విధమగు భ్రాంతి అనే ఆస్పత్రిలోనుండు పిచ్చివారివంటి వారలనియే ఆత్మజ్ఞానులు పరిగణింతురు. మంచి సుగుణమును, మంచి ఆచరణయు, మంచి నియమ నిష్ఠయు గల్గియుండిన చాలును. వారు మనుష్యమాత్రులలో నెవరైనను ఈశ్వరుని పొందగల్గుదురు. ఇది సత్యము.

3. వేదవేదాంతముల సారమును, ఉపాస్యమును ప్రణవమే యని అనగా ప్రణవార్థస్వరూపమగు పరబ్రహ్మమే యని సమస్త శాస్త్రములును జెప్పుచున్నవి. గీత అ.7;'ప్రణవః సర్వవేదేషు' అనగా సమస్త వేదములలో ప్రణవమే సారభూతము. అదే శ్రీమన్నారాయణ స్వరూపము. గీత అ.10.

'గిరామస్మ్యేకమక్షరం' వేదార్థ వాక్కులలో ఏకాక్షరస్వరూపమగు ప్రణవము నారాయణస్వరూపము. గీత అష్టమాధ్యాయములో ఈ ఓంకార ధ్యానమును విశదముగా గనందగును. శ్రీకాళిదాసకవియు (రఘువంశములో) ''ప్రణవః ఛందసామివ'' అని వచించిరి. శ్రీపాతంజల యోగసూత్రము ''తస్య వాచకః ప్రణవః'' – పరమేశ్వరునియొక్క యథార్థమైన వాచకము ఓంకార మనబడును. ఓంకారమే పరబ్రహ్మస్వరూపమని నిర్వచించుటలో కొన్ని రహస్యములు గలవు. ఏలన, బ్రహ్మము అనగా దైవస్వరూపము చరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళములలో వెల్గుచుండు దివ్యజ్యోతిస్వరూపము గదా! అప్పుడు స్త్రీలలోను, పురుషులలోను, నపుంసకులలోను ఆ దివ్యజ్యోతియే వెల్గుచుండగా సర్వజనులకు తమలో వెల్గుచుండు బ్రహ్మమును ధ్యానముచేయుటకు హక్కు లేదని చెప్పుట కెవరికి అధికారము గలదు? ప్రత్యేకముగా పుంలింగముగాని, స్త్రీలింగముగాని, నపుంసకలింగముగాని చెప్పదగదు. అట్లు చెప్పినచో పరమాత్మ స్వరూపము గూడ గుణత్రయముతో గూడినదే యగును. గుణత్రయము ప్రకృతితో గూడినది. గీత అ. 14లో చూడందగును. ప్రకృతితో గూడినదానికి వికారమును, విలయమును, జననమరణములును గల్గుట నిక్కము. ఓంకారము పుంలింగముగాని, స్త్రీలింగముగాని, నపుంసకలింగముగాని, ఏకవచనముగాని, ద్వివచనము గాని, బహువచనముగాని, ప్రథమాది విభక్తులతో సంబంధించిన యే శబ్దముగాని కాదు. కనుకనే అఖండైకరసజ్ఞానస్వరూపమని చెప్పుటకు కారణము. తక్కిన శివమంత్రముగాని, విష్ణుమంత్రముగాని, శక్తిమంత్ర ముగాని, వెయ్యేల, ఏ మంత్రమైనను పుంలింగములోనో, స్త్రీలింగములోనో, నపుంసక లింగములోనో ఉండుటయేగాక ప్రథమాది విభక్తులలో నేదైన ఒక విభక్తితోగూడియే యుండును. కనుక అట్టిదాని నుపాసించువారికి నిశ్శేషప్రకృతిరహిత ప్రబోధ సాక్షాత్కారజ్ఞానము గల్గుట దుస్తరము. అంతేగాక వ్యష్టిగత హృదయగ్రంథిత్రయ విచ్ఛేదమును, సమష్టిగత గ్రంథిత్రయ విధ్వంసమును ఇట్టివారికి గలుగదు. వీరి జ్ఞానము హద్దునకు లోబడియే యుండును. పాతంజలయోగసూత్రము: 'తజ్జపస్తదర్థభావనం' – ప్రణవమును

జపమాచరించునప్పుడు దానియొక్క అర్థభావము గూడ నుండవలెను. భాషమాత్రముండి భావముతో కలియనిచో, మందుమాత్రము వేసి గుండులేక కాల్చెడు ఫిరంగి శబ్దమువలె నుండును. అట్టి ఫిరంగి ధ్వనిని మాత్రము చేయునేగాని లక్ష్యమును భేదించుటగాని, ప్రతి బంధమును విధ్వంసమొనర్పు టగాని చేయజాలదుగదా! ఆలాగున మంత్రార్థమగు ధ్యేయాకారములో మనస్సు లీనము గానిచో ఆత్మయొక్క ఆవరణములు నశించుటగాని , ధ్యేయాకారము స్ఫురించుట గాని ధ్యాతకు లభింపదు. లేక విద్యుచ్ఛక్తి తంతితో కలియని యంత్రమువలెను, దీపమువలెను వ్యర్థముగానే యుండును. తంతితో కలియని యంత్రము పనిచేయుటగాని, దీపము వెల్గుటగాని లేనియట్లు, హృదయము వికసించుటగాని, జ్ఞానము ప్రజ్వలించుటగాని ఇట్టి నిష్ఠగల వానికుండదు. అంతేగాక బీజము లేని ఒట్టిపొట్టుతో కృషి చేసిన యేలాగున ఫలముండదో, అలాగున ప్రతి జపములోగాని, అర్చన పూజాదులలోగాని పారాయణలోగాని, భావముతో మనస్సు ఐక్యము గానిచో మంచి ఫలము గలగదు. ఇదే పూర్వీకులగు ఋషులకును, ప్రస్తుతముండెడు బ్రహ్మనిష్ఠులకును గల తారతమ్యము. శ్రీ వసిష్ఠాది మహర్షులు ఏ గాయత్ర్యు పాసనచే నట్టి మహత్పదవిని బొందిరో అది యాగ్రాయత్రీ మంత్రమే. సనకాది ఋషులు ఏ ఓంకారోపాసనచే అట్టి మహర్షులైనారో అది యా యోంకారమే. శ్రీనారదాది మహర్షులు ఏ నారాయణ మంత్రధ్యానముచే త్రికాలజ్ఞానవేత్తలైరో అది నారాయణ మంత్రమే. ఏ శివమంత్ర మహిమచే వామదేవాది ఋషిసత్తములు సర్వజ్ఞులైరో అది యీ శివమంత్రమే. ఏ శ్రీ రామమంత్రముచే శ్రీవాల్మీకి, శ్రీహనుమదాదులు దివ్యపురుషులైరో, అది ఈ శ్రీరామ మంత్రమే. వారు భావములో మనస్సును ఐక్యపరచినందుచే అట్టి మహిమ వారికి గల్గినది. ఇప్పుడుండు వారలు వేషములోను, భాషలోను తగిలిన మనస్సు గలవారగుటచే వారికి భావములో మనస్సు ఐక్యమగుట లేదు. మరియు కట్టెల ననుసరించి అగ్ని హెచ్చుగాను తక్కువగాను పరిణమించునట్లు ఇంద్రియ నిగ్రహము, తపస్సు, విషయ విరక్తి, శాంతము, కరుణ, సద్భక్తి, సత్యము, దీర్ఘకాల బ్రహ్మానుసంధాన పరమగు యోగము మొదలగు

గుణములను బట్టియు ఈ శక్తి హెచ్చుతక్కువలుగా మారుచుండును. అగ్నిలో కట్టెలు వేయువారు స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులు గాని, సన్న్యాసులుగాని, సంసారులుగాని యెవరైనను అగ్నియొక్క నైజ స్వభావమేలాగున ప్రజ్వలించునో, ఆలాగున పైజెప్పిన గుణములు గలవారెవరైనను వారికి అట్టి దైవీకమగు మహచ్ఛక్తి గల్గును. కలిగియుండెను, కలిగియున్నది. ఇది సత్యము. దీనియందేలాంటి సందేహమును లేదు. ముమ్మాటికి సత్యము.

మానవులారా! ఈ సత్యము నెఱింగి యిప్పుడైనను ప్రబోధస్థితి గల్గుటకు తగిన ప్రయత్నము చేయుడు. మీరు అట్టి దైవస్థితిని పొందగల్గుదురు. ఈ విషయమున రామోత్తర తాపిన్యుపనిషత్ ఇలా చెప్పినది చూడుడు:

**మంత్రో ఽ యం వాచకో రామో వాచ్యః స్యాద్యోగ ఏతయోః।**
**ఫలదశ్చైవ సర్వేషాం సాధకానాం న సంశయః॥**

ఈ శ్రీరామ మంత్రమునకు వాచకము 'రామ' యనియు, వాచ్యము అనగ మంత్రార్థము తారకపరబ్రహ్మ శ్రీరామమూర్తి యనియు గ్రహించవలయును. ఈ మంత్రము యొక్కయు, మంత్రార్థము యొక్కయు ఐక్యము ఏ సాధకునకు గల్గునో అట్టివారెవరైనను వారందరికిని ఫలము గల్గుట నిశ్చయము. సంశయము లేదు. అనగా దైవభావముతో జపించుటగాని, పారాయణ చేయుటగాని, వ్రాయుటగాని చేయవలెనని భావము. మరియు కుహనిర్వాణ తంత్రము ఈలాగున చెప్పుచున్నది.

**మంత్రార్థం మంత్రచైతన్యం యోన జానాతి సాధకః।**
**శతలక్షం ప్రజప్తాఽపి తస్య మంత్రో న సిధ్యతి॥**

మంత్రార్థము, మంత్ర చైతన్యము అనగా మంత్రము యొక్కయు, మంత్రార్థ దైవము యొక్కయు ఐక్యము ఏ సాధకుడు తెలిసికొనుట లేదో అట్టివాడు వందలకొలది లక్షలకొలది జపమాచరించినను సిద్ధిని పొందజాలడు. ఇట్టి విషయము లన్నిటిని చాలజాగ్రత్తతో బ్రహ్మనిష్ఠులు గ్రహింవకపోయినచో గొప్పస్థితిని పొందజాలరు. ఈ క్రింది శ్లోకములో మంత్రము యొక్క అర్థము వ్రాయబడుచున్నది.

**మకారం మననం చైవ త్రకారం త్రాణముచ్యతే।**
**మననత్రాణమిత్యాహుర్మంత్రమిత్యభిధీయతే॥**

మకారమునకు మననమనియు, త్రకారమునకు త్రాణ మనియు అనగా తరింపజేయుటయనియు లేక రక్షించుటయనియు అర్థము. మననము చేతను, త్రాణనముచేతను 'మంత్ర' మని చెప్పబడును. అనగా మంత్రార్థముతో మనస్సును ఐక్యపరచి మనస్సులో స్మరణము చేయువానిని మంత్రము జనన మరణ భవసాగరమునుండి ఉద్ధరించును. ఇట్టి కారణముచేతనే మంత్రమను శబ్దము గలిగినది.

**ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి॥**

సముద్రమును దాటుటకు ఓడ యెటువంటిదో ఆలాగున సంసార దుఃఖసాగరము నుండి తరింపచేయుటలో ఓంకారమనెడి నావకు సమానమైనది మరియొకటి లేదు అని ఓంకారము యొక్క భావము.

''ప్రణవాదపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి'' ప్రణవమున కన్యమైన మంత్రమును జపించిన యెప్పుడు ముక్తి గల్గును? అనగా గలుగ నేరదని భావము. ''ఓంకారః సర్వమంత్రాణాముత్తమః పరికీర్తితః'' ఓంకారము సమస్త మంత్రములలో నుత్తమోత్తమమైనదని మహర్షులు కీర్తనము చేయుచున్నారు. వేదములును అలాగుననే స్తోత్రము జేయుచున్నవి అని సూతసంహిత. ఇప్పుడు అథర్వశిఖోపనిషత్తులో ప్రణవశబ్దమునకును, ఓంకార శబ్దమునకును, తారక శబ్దమునకు గల అర్థములు నిరూపింపబడుచున్నవి.

## ప్ర ణ వా ర్థ ము

**మూ॥ ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః।**
**చతుర్ధావస్థిత ఇతి సర్వదేవ వేదయోనిః సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్॥**

సకల ప్రాణములను (ప్రపంచమంతటిని) పరమాత్మ యందు జేర్పించుటంపట్టి ప్రణవమనబడును. నాలుగు పాదములతో (అనగా నాలుగు అంగములతో) గూడియుండుటవలన బ్రహ్మ విష్ణు రుద్రాది సకల దేవతలకును, సకల వేదములకును కారణస్థానమై (యోనియై) యున్నది.

సకల వాచ్యవస్తువులును (సకల దేవతల నామములును) ప్రణవాత్మకముగును.

## ఓం కా రా ర్థ ము

**మూ॥ సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః॥**

ఒక్కమారు ఓంకారమును నుచ్చరించిన శ్రేష్ఠగతిని (పరమ పదమును) జేర్పించుటంబట్టి ఓంకారమనంబడును.

వి॥ ఆత్మను ఊర్ధ్వగామిగా అనగా నూర్ధ్వగతిని, లేక బ్రహ్మ రంధ్రమును, లేక సుషుమ్నాగ్రమును, లేక తురీయమును, లేక సాక్షిత్వమును గలుగచేయున దగుటచే ఓంకారశబ్దమేర్పడినది. ఆలాగున ప్రకృతిలో చిక్కుకొనియుండు జీవులను నివృత్తిజేసి ప్రకృతి రహితుడగు పరమ పురుషునిలో అనగా పరమాత్మలో చేర్చు కారణముచే ప్రణవశబ్దము వచ్చినది.

## తారక శబ్దార్థము

**మూ॥ దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖ భయేభ్యః సంతారయతీతి తారణాత్తారః॥**

సకల దేవతలును ప్రణవస్వరూపమే. సమస్త దుఃఖముల నుండియు సకల భయములనుండియు తరింపజేయునదిగా నుండుటంబట్టి తారణమనంబడును. తారణము చేయుటవలన తారక మనంబడును.

వి॥ సంసారదుఃఖమునుండియు, తాపత్రయభీతినుండియు అజ్ఞానసాగరమునుండియు తరింపజేయునది ఈ ప్రణవమగుటచే దీనికి తారకమను పేరువచ్చినది. శ్రీకాశియందు మృతినొందువారి దక్షిణకర్ణములో శ్రీపరమ శివుండు ఉపదేశించెడు తారకమంత్రము ఈయోంకారమే యని పద్మపురాణాంతర్గత మాఘమాహాత్మ్యములో గల మృగశృంగ మహర్షి కథయందు చెప్పబడుచున్నది.

**అథైకదా తా మణికర్ణికాయాం**
**మధ్యందినస్నానవిధిం విధాయ।**
**ప్రదక్షిణీకృత్య శివాలయం త**
**జ్జాతశ్రమాఘూర్ణ దృశః స్మరంత్యః॥**

స్వాంతే శివం విశ్వజగన్నిధానం
నిపేతురుర్వ్యాం శరణం భవేతి।
భవేశ శంభో! శివ శూలపాణే!
క్రోశంత్య ఏవం మృగశృంగభార్యాః॥

కాశీపతిః కారుణికః కరాభ్యా
మాదాయ మూర్ధానమతీవ తాసామ్।
ఆగమ్య వేగాద్యుగపచ్చ తాసా
మోంకారమోంకారయతి స్మ కర్ణే॥

ఒకనాడు మృగశృంగుని భార్యలు నలుగురు మధ్యాహ్నమున మణికర్ణికయందు శాస్త్రోక్తముగా స్నానముజేసి, ఆవిశ్వేశ్వరాలయమును ప్రదక్షిణము చేయుచుండగా. ఆ ప్రదక్షిణముచేయుట చేత గలిగిన శ్రమవలన ఒళ్ళు తిరుగగా, వారి మనస్సులందు ఇట్లు వేడుకొనిరి. ''ఓ విశ్వేశ్వరా! సకల పాపములను బోగొట్టువాడా! కోరినవారికి సమస్త శుభములను ఇచ్చువాడా! హేశూలపాణే! సకల భయములను బోగొట్టువాడా! మాకు రక్షకుడవగుము'' అని అనేక ప్రకారములు వేడుకొనుచు స్మృతి తప్పి నేలపై బడిరి. అప్పుడు కాశీ విశ్వేశ్వరుడు ఆమృగశృంగుని భార్యలయందు కనికరముగలవాడై వారి తలలను తన చేతులతో లేవనెత్తి పట్టుకొని ఆనలుగురి చెవుల యందును ఏకకాలములోనే 'ఓం, ఓం' అని తారకమంత్రమయిన ప్రణవమును ఉపదేశించెను. అప్పుడు వారు దివ్యదేహములు గల వారలై శాశ్వతమగు శివపదమును బొందిరి.

మరియు వరాహోపనిషత్తునందు ఈలాగున చెప్పబడి యున్నది. ''సర్వవిఘ్నహరశ్చాయం ప్రణవః సర్వదోషహా'' ప్రణవమగు ఈ మంత్రము సమస్తవిఘ్నములను హరింపచేయునదియును, సర్వదోషములను లేకుండ చేయునదియును, సమస్తమంగళములను గలుగ జేయునదిగా నున్నది.

హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః।
ఆప్యాయనః ప్లుతో వాఽపి త్రివిధోచ్చారణేన తు॥

ఈ ఓంకారోచ్చారణ హ్రస్వమైనచో సమస్తపాపములను దహింప చేయును; దీర్ఘమైనచో మోక్షమును గలుగజేయును. ప్లుతమైనచో ఇష్టార్థ సిద్ధి నొనగూర్చును. కనుక ఈ యుచ్చారణ మూడు విధములుగా నున్నది. ఇది బ్రహ్మవేత్తలు గ్రహించుకొనవలయును. ఈ ప్రణవ ధ్వని ఏ యే స్థానములలో వెళ్ళునప్పుడు హ్రస్వ, దీర్ఘ, ప్లుతములగునో అది యా క్రిందశ్లోకముచే విశదీకరింపబడుచున్నది.

**హ్రస్వం బిందుగతం దైర్ఘ్యం బ్రహ్మరంధ్ర గతం ప్లుతమ్।**
**ద్వాదశాంతర్గతం మంత్రం ప్రసాదం మంత్రసిద్ధయే॥**

ఈ ప్రణవధ్వని బిందుగతమగునప్పుడు హ్రస్వమనియు, బ్రహ్మరంధ్రగత మగునప్పుడు దీర్ఘమనియు, ద్వాదశాంతర్గతమగు నప్పుడు ప్లుతమనియు చెప్పబడును. ఇది ప్రణవమంత్రముయొక్క పై చెప్పబడిన మూడు విధములగు సిద్ధులను గలుగజేయు విధియై యున్నది. ఈ యోంకారమునే యెనిమిది భాగములుగా విభజించి సూక్ష్మాష్టాక్షర మంత్రసారమని ఉపదేశించియున్నారు. మరల తారక మడిగినప్పుడు ఈ ఓంకారమే తారకముగూడ నని శ్రీయాజ్ఞవల్క్యులు శ్రీ భరద్వాజునకు బోధించియున్నారు. మరల ఉపాస్య విషయమై అడిగిప్పుడు ఈ ఓంకారమే ఉపాస్యమని ఉపదేశించి యున్నారు.

**మూ॥ అథ హైనం భారద్వాజః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యం కిం తారకం**
**కిం తారయతీతి కిం ఉపాసితవ్యం। సహోవాచ యాజ్ఞవల్క్యః**

అనంతరము భారద్వాజుడు ఆ యాజ్ఞవల్క్యమహర్షిని సవినయముగా అడిగెను. తారకమన ఏమి? తరించుట అనగా ఏమి? ఉపాసించుటకు యోగ్యమైన దెద్ది? ఈ మూడు ప్రశ్నలకు శ్రీ యాజ్ఞవల్క్యుడు ఇట్లు సమాధానము చెప్పెను.

**మూ॥ ఓమిత్యేతదక్షరం పరం బ్రహ్మ తదేవోపాసితవ్యమ్। ఏతదేవ**
**సూక్ష్మాష్టాక్షరం భవతి। తదేతదష్టాత్మకోఽష్టధా భవతి॥అకారః**
**ప్రథమాక్షరో భవతి। ఉకారో ద్వితీయాక్షరో భవతి। మకార**
**స్తృతీయాక్షరో భవతి।బిందుస్తురీయాక్షరో భవతి। నాదః**

**పంచమాక్షరో భవతి। కలా షష్ఠాక్షరో భవతి। కలాతీతా సప్తమాక్షరో భవతి। తత్పరశ్చాష్ట మాక్షరో భవతి। తారకత్వా త్తారకో భవతి। తదేవ తారకం బ్రహ్మత్వం విద్ధి తదేవోపాసితవ్యమ్॥**

'ఓం' అని గల యీ అక్షరమే పరబ్రహ్మస్వరూపము. అది యొక్కటియే ముముక్షువులకు ఉపాసింప యోగ్యమైనది. ఇదే శ్రీనారాయణ సూక్ష్మాష్టాక్షరమంత్రమగుచున్నది. అది అష్టాత్మకమై అష్టవిధములగుచున్నది. అకారము ప్రథమాక్షరము. ఉకారము ద్వితీయాక్షరము. మకారము తృతీయాక్షరము. బిందువు తురీయాక్షరము. నాదము పంచమాక్షరము. కల షష్ఠాక్షరము. కలాతీతము సప్తమాక్షరము. తత్పరము అష్టమాక్షరము అగుచున్నది. జననమరణ దుఃఖములకు హేతువగు సంసారసాగరమును ఇది తరింప జేయునదగుటచే దీనికి తారకమని పేరు వచ్చినది. కనుక ఆ ఓంకారమే తారకము, అనగా అపారమైన సాగరమును దాటుటకు మంచి ఓడవలె ఈ ఓంకారము మాయామోహమగు సంసార సాగరమును దాటించును. అదే పరబ్రహ్మస్వరూపము. అదే ముముక్షువులకు ఉపాసనాయోగ్యమైనది అని తారసారోపనిషత్తు- ద్వితీయ ఖండము.

ఈలాగుననే శివ పంచాక్షరముయొక్క సూక్ష్మపంచాక్షరము ఓం కారమే యని గ్రంథాంతరమున గలదు. అకార, ఉకార, మకార, అర్ధమాత్ర, సాక్షాత్కారముతో గూడినదానికి బ్రహ్మ, విష్ణు, రుద్ర, సదాశివ, మహేశ్వరు లను పేర్లతో గూడినది యీ ఓంకారమే యగుచున్నది. ఈ ఓంకారముయొ క్క పంచముఖములకు పంచాక్షరమనియు, దానికి సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానాదులు ముఖము లనియు గ్రహింపవలయును. ఇంతవరకు ఓంకారమును గురించి మనము గ్రహింపవలసిన విషయముల సారము చెప్పబడిదనియే తలంచుచున్నాను. శాస్త్రమనంతమగుటచే నికను గ్రహించవలసిన విషయముండిన ముముక్షువులు గ్రహించుకొనవచ్చును.

**ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఈ ఆత్మయే క్షేత్రజ్ఞుడని చెప్పబడుచున్నది. ప్రాపంచిక విషయ

గుణములతో నుండువరకు యాతడు బద్ధుడు, అజ్ఞాని, కించిజ్ఞుడు, సంసారి అని పిలువబడును. పైజెప్పిన ప్రాకృత గుణములు వీడిపోనప్పుడు జ్ఞానియై సంసారబంధమునుండి తొలగి పరమాత్మను బొందుచుండును అని మహాభారతము శాంతిపర్వమునందు గలదు.

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।**

**పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

నిశ్చయబుద్ధి గలవానిచేత ఏవస్తువు తీవ్రవేగముగ (రేయింబవళ్ళు) భావింపబడుచున్నదో, పురుషుడు ఆజ్ఞేయవస్తువుగా (అపరోక్షముగా, తెలియదగిన బ్రహ్మముగా) భ్రమరకీటకమువలె అగుచున్నాడు.

వి॥ మనస్సులో బ్రహ్మమును పొందవలెనను తీవ్రవేదనతోను రేయింబవళ్ళు నిరంతరము ధ్యానము చేయువాడు నిరంతర చింతనగల కీటకము భ్రమరమై మారునట్లు జీవత్వరహితమగు శివత్వమును బొందును. అనగా పరబ్రహ్మ సాక్షాత్కార స్థితి నొంద గల్గును.

**ఏభిరంగైః సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।**

**కించిత్పక్వ కషాయాణాం హఠయోగేన సంయుతః॥**

ఈ చెప్పబడిన యంగములతో గూడినది ధ్యానయోగ మనంబడును . కొంచెము పక్వ కషాయము గలవారికి హఠయోగముతో గూడిన యంగములు అభ్యసింపదగినవి.

వి॥ ధ్యానయోగమునందు చిత్తస్థైర్యము లేకపోయినచో ప్రాణాయామాది అభ్యాసయోగమును అవశ్యము శీలించుకొనవలెను.

**పరిపక్వం మనో యేషాం కేవలోఽయం సిద్ధిదః।**

**గురుదైవత భక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥**

పరిపక్వ హృదయము గలవారికి కేవలము ఈ రాజయోగము మోక్ష సిద్ధి నొసంగును. అట్లే గురువునందును, దైవమునందును భక్తిగల సకల జనులకును సులభముగను శీఘ్రముగను ఈ రాజయోగము సిద్ధించును.

వి॥ పై జెప్పిన ప్రాణయామాది యోగాభ్యాసమునకు శక్తిలేని వారు నిర్మల హృదయులై విషయవిరక్తులై కరుణాళువులై అనన్యమైన భక్తి

యోగమును శీలించిన చాలును అని జగద్గురు శ్రీ శంకరభగవత్పాదాచార్యుల వారు అపరోక్షానుభూతియందు ఆనతిచ్చిరి.

**యావద్దేహమవస్థాసు సమచిత్తతయైవ యే।**
**కర్మేంద్రియైర్న తిష్ఠంతి న తే తత్త్వవిదశ్శఠాః॥**

ఎవరు దేహముండునంతవరకు సుఖ దుఃఖ దశలయందు నిర్వికార చిత్తత చే కర్మేంద్రియముల వృత్తుల నణచియుండరో వారు తత్త్వజ్ఞులు కానేరరు; మరి వంచకులే యగుచున్నారు.

**ఏష దేహదశా దుఃఖపరిత్యాగో హ్యనుత్తమః।**
**యత్సామ్యం చేతసో యోగాన్న తు కర్మేంద్రియ స్థితేః॥**

సమాధినిష్ఠచే చిత్తమునకు నే నిర్వికారత్వము గలుగునో, అదియే శ్రేష్ఠమైన పదవిగాని, కర్మేంద్రియముల పనులచే గలిగెడు సుఖదుఃఖములకు భయపడి పనిని మానుకొనుట శ్రేష్ఠము కానేరదు. కావున జ్ఞానవంతుడు శరీర ముండునంతవరకు కర్మేంద్రియములతో సర్వావస్థలయందును సదాచారము ననుసరించియే యుండవలయును గాని, సదాచారము నుల్లంఘింపదగదు. మనస్సు మొదలగు జ్ఞానేంద్రియములతో నెపుడును నిర్వికారతతో నుండవలయునేగాని సవికారతతో నుండదగదు అని జ్ఞానవాసిష్ఠము నిర్వాణ ప్రకరణము. శ్రీగీతాశాస్త్రమంతయు దీనిపైననే ఆధారపడియున్నది.

**భ్రష్టబీజోపమా భూయో జన్మాంకురవివర్జితా।**
**హృది జీవద్విముక్తానాం శుద్ధా భవతి వాసనా ॥**

అగ్నిలో వేయించిన బీజములు బీజాకృతిగా నుండినను, అంకుర మేలాగున దహించిపోయియుండునో అలాగున జీవన్ముక్తులకు సర్వేంద్రియ ము లుండినను పరిశుద్ధబ్రహ్మభావన గలవారగుటచే అశుద్ధవాసన పునర్జన్మము నకు కారణము గాజాలదు.

**జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం జ్ఞ చిత్తం సత్యముచ్యతే।**
**నానార్థాన్యత్వభాక్చిత్తం బోధాత్మ్రమం సువర్ణవత్ ॥**

వృత్తిరహితమైన జ్ఞానియొక్క చిత్తము చిత్తమని అనగా మనస్సని చెప్పబడదు. అది సత్యస్వరూపమగు దైవత్వమనియే చెప్పబడును. దృశ్యాది

విషయములతో గూడిన చిత్తమే చిత్తమనబడును. స్ఫుటముచే తామ్రము సువర్ణమైనటుల బోధముచే జ్ఞాని చిత్తము దైవత్వమై యుండును.

**పునర్జననయోగ్యా యా వాసనా ఘనవాసనా।**
**సా ప్రోక్తా చిత్త శబ్దేన న సా తజ్జ్ఞస్య విద్యతే॥**

పునర్జన్మంబునకు మూలంబగు నేదృఢ వాసన కలదో అదియే చిత్త శబ్దముచే చెప్పబడుచున్నది. అయ్యది జ్ఞానికి లేదు. కనుక జ్ఞానియొక్క చిత్తము చిత్తమని చెప్పబడదు.

**మూ ॥ మూఢ చిత్తం చిత్తమాహుః ప్రబుద్ధం సత్త్వముచ్యతే।**
**అప్రబుద్ధా హి చిత్తస్థాస్సత్త్వస్థాస్సుమహాధియః ॥**

జ్ఞానరహితమగునది (మలినవాసనాయుక్తమైనది) చిత్తమనియు, జ్ఞాన యుక్తమైనది. విశుద్ధవాసనా యుక్తమైనది) సత్త్వమనియు చెప్పబడు చున్నది. కావున అజ్ఞానులు చిత్తనిష్ఠులును, జ్ఞానవంతులు సత్త్వనిష్ఠులును నగుచున్నారు అని జ్ఞానవాసిష్ఠము.

ఇక ఈఉపోద్ఘాతమును ఉపసంహరించుటకు మందుగా ముండకోప నిషత్తులో గల ఒక్క విషయమును తెలిపి పూర్తి చేయుచున్నాము.

శౌనకముని యను మహాశయుడు అంగిరసుడు అను మునిని అడిగిన విషయము:

**మూ॥ శౌనకోహ వై మహాశాలో౽ంగిరసం విధివదుపపన్నఃపప్రచ్ఛ**
**కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥**

గొప్ప బుద్ధిశాలియు, శునకుడనువాని పుత్రుడును అగు శౌనకుడను మహర్షి, భారద్వాజ శిష్యుడగు అంగిరసుడను ఆచార్యుని కడకు, శిష్యుడు, ఆచార్యుని సమీపించునప్పుడు యెట్టి విధి ననుసరించి రావలయునో ఆ విధముగా వచ్చినవాడయి, ''ఓమహాత్మా! ఏ వస్తువును దెలిసికొన్నయెడల దెలిసికొనదగినదంతయు చక్కగా దెలిసికొనబడినదగునో, అట్టి వస్తువునుపదే శింపుడని యడిగెను. (శిష్యుడు గురువు వద్దకు వెళ్ళునప్పుడు శుచిర్భూతుడు పూజాద్రవ్యములను స్వయముగా నెత్తుకొని గురువుయొక్క సమయము కనిపెట్టి భక్తితో నుండవలయును)

మూ॥ తస్మై సహోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ
యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ ॥

ఈ విధముగా శాస్త్రవిధి ననుసరించి తన సమీపమునకు వచ్చి జిజ్ఞాసువై ప్రశ్నము నొనర్చిన శౌనకునితో అంగిరసుండిట్లని చెప్పుచున్నాడు. వేదార్థము నెరింగి పరమార్థజ్ఞులైన బ్రహ్మవేత్తలు పర యనియు, అపర యనియు పేర్లుగల రెండు విద్యలు గలవనియు, వానిని తెలిసికొనవలయున నియు పలుకుచున్నారు. పర విద్యయనగా పరమాత్మను, గురించి బోధించునట్టి విద్య. అపరవిద్య యనగా ధర్మాధర్మ సాధనములను తత్ఫలము లను బోధించునట్టి విద్య.

ఈ ఉపనిషత్తుయొక్క ప్రశ్నోత్తరములచేత ప్రస్తుతము మనము గ్రహించవలసిన విషయము చాలా గలదు. ఇదే యథార్థమైన గురుకుల వాసముచే గలిగెడు మహర్షులయొక్క పరంపరా విధియై యున్నది. ఇప్పుడు అట్టి గురుకులవాసము లేకపోవుటచేత సత్యాసత్యములు, ధర్మాధర్మములు సంపూర్ణముగా ముముక్షువులు తెలుసుకొన జాలక యున్నారు. శౌనక మహర్షి పరబ్రహ్మ సాక్షాత్కార విషయము మాత్రమే అడిగిరి. అప్పుడు అంగిరస మహర్షి శిష్యవాత్సల్యముతో నాయనా! పరవిద్యయు అపర విద్యయు గ్రహించియుండవలెనని తాను స్వయముగా చెప్పుటచే బ్రహ్మ వేత్తలగు మహర్షులు ఈరెండువిద్యలు గ్రహించి యుండవలెనని అస్మదాదులకు తెలియునట్లు ఉపదేశించుట ఎంత సమంజసముగా నున్నది? అనగా జ్ఞానము, జ్ఞానియొక్క ధర్మము రెండును గ్రహించియుండవలయునని భావము. ఇప్పుడుండు వారలు జ్ఞానమును తెలిసికొనిన చాలును, జ్ఞానికి మరల యేమి విధి గలదు? అని ఈలాగున నిర్భయముగా జెప్పుటకు కారణము గురుపరంపరావిధి ననుసరింపకపోవుటయేగాని మరి యేమియు కాదు. ఒకవేళ ఆత్మజ్ఞానికి నిత్యనైమిత్తిక విధి లేనప్పటికి సత్యధర్మాది విధులు లేక పోవునా? అంతేకాక యిట్లుచెప్పువారు తాము ఆత్మజ్ఞానులైరా? లేదా?యని సద్గురువులచేతను, సచ్ఛాస్త్రములచేతను, స్వానుభవముచేతను విచారణ జేసినారా? శాస్త్రదృష్టి, గురువాక్యము, స్వానుభవము ఈ మూడును

ఏకావస్థను పొందిన గదా నిర్మల జ్ఞానమగును. తక్కినది ఉన్మత్త ప్రలాపమనియే బ్రహ్మవేత్తలు తలంతురు. లేక న్యాయస్థానములో వాది ప్రతివాదుల విషయములను న్యాయవాదులు విమర్శింపకయు, తమకు తామే తమవాదము సత్యమని చెప్పుకొనునట్లే యుండును. ఈ స్వకపోలకల్పిత విధికార్యమును ఎంతవరకు అమలు జరుపగల్గుదురో విజ్ఞులే నిర్ణయింప గల్గుదురు. పై ప్రశ్న రోగియైనవాడు వైద్యుని ఆశ్రయించి రోగశమనోపా యౌషధమును అడిగినట్లున్నది. వైద్యునితో పథ్యముగూడ అడుగవలసినది. ఇది రోగిధర్మమైయున్నది. అట్లు అడుగకపోయినను వైద్యుడు ఔషధమునకు పథ్యము నిర్ణయించుట విధిగదా? ఎంత మంచి మందైనను సరియైన పథ్యము లేనిచో రోగమును హరింపచేయ శక్తిలేనిదగునట్లు, దివ్యరసాయనమువంటి బ్రహ్మోపదేశమైనను సత్య, ధర్మ, సదాచార, శమదమాది సాధన చతుష్టయసంపత్తి సంపూర్ణముగా లేనిచో అజ్ఞానరోగమును రహిత మొనర్ప శక్తి యుండజాలదు. కనుకనే ప్రస్తుత బ్రహ్మనిష్ఠలలో కొందరు సన్న్యాసియు సంసారియుకాని, భూలోకమునకు స్వర్గలోకమునకు మధ్యకల్పితమైన త్రిశంకుస్వర్గస్థితిలోనున్నారు. భిత్తిని శుద్ధపరచక వ్రాసెడు చిత్ర మేలాగున నుండునో, ఆలాగున సత్యధర్మానుష్ఠానములచే నిర్మల హృదయము లేనివారి బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారము ఆకాశములో చిత్రించిన చిత్రమువలె నుండును.

**ద్వైతవిజ్ఞానమాసాద్య ముక్తిం వాంఛంతి యే నరాః।**
**తే మహామోహసంసారసర్పదష్టా న సంశయః ॥**

ఏ మానవులు వాక్కుతో అద్వైతవచనము లుచ్చరించి ద్వైతక్రియయ గు విషయములో నుందురో, అట్టి మోక్షాపేక్షగల మానవులు మహా మోహసం సారసర్పవిషముచే స్మృతిదప్పిన వారలే యగుదురు. సంశయము లేదు.

**ముక్తిం దదాతి వైరాగ్యం రాగో యచ్ఛతి బంధతామ్।**
**మతం వై సర్వశాస్త్రాణాం యథేచ్ఛసి తథా కురు॥**

అష్టావక్రమునీంద్రుడు జనకులకొరకుపదేశించినది యిది. సమస్త విషయములలోగల వైరాగ్యము మోక్షము నిచ్చుచున్నది. విషయేచ్ఛ బంధము గలుగజేయుచున్నది. ఇది సర్వశాస్త్రములయొక్క సిద్ధాంతమని నమ్మము.

ఆవల నీయిష్టమెట్లో అట్లుచేయుము.

**బ్రహ్మణః సర్వభూతాని జాయంతే పరమాత్మనః।**
**తస్మాదేతాని బ్రహ్మైవ భవంతీతి విచింతయ॥**

పరమాత్ముఁడగు పరబ్రహ్మనుండియే యీ సమస్త భూతములును పుట్టుచున్నవి. అందువలన యీ చరాచరమంతయు బ్రహ్మమయమని నిశ్చలమైన చింతనము గలిగియుండుము.

**సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్॥**

సువర్ణమునుండి గల్గిన అణువులుగాని, ఆభరణములు గాని, యేలాగున సువర్ణమయమైయుండునో, ఆలాగున బ్రహ్మమునుండి గల్గిన ం రా చరాచరమంతయు శాశ్వత బ్రహ్మమయమైయుండునని దృఢముగా భావనచేయుము.

**నాసాగ్రే దృష్టిమారోప్య హస్తపాదౌ చ సంయతౌ।**
**మనః సర్వత్ర సంగృహ్య ఓంకార ం తత్ర చింతయేత్॥**

కరచరణాది సర్వేంద్రియములను సంయమనముచేసి, బాహ్యవృత్తి నుండి మనస్సు మొదలైన యింద్రియములను వశీకరించి, నాసాగ్రమందు దృష్టిని ప్రాణవాయువుతో స్థిరపరచి, ఓంకారమును ఉచ్చరించి ఓంకారార్థమగు పరబ్రహ్మభావముతో నుండుము. నాసాగ్రమనియు, సుషుమ్నాగ్రమనియు, బ్రహ్మబిలమనియు, హృదయమనియు, తురీయస్థానమనియు స్వస్వ రూపస్థానమునకు పేర్లు గలవని గ్రహించవలయును.

**ప్రథమం తారకం చైవ ద్వితీయం దండముచ్యతే।**
**తృతీయం కుండలాకారం చతుర్థం త్వర్ధచంద్రకమ్।**
**పంచమం బిందుసంయుక్తం ఓమితి జ్యోతిరూపకమ్॥**

లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.

ఓంశాంతిః శాంతిః శాంతిః

మీ చరాచరసుఖాభిలాషి

**శ్రీ మలయాళస్వాములవారు.**

హరిః ఓమ్ తత్ సత్

# ఓంకారము

## శ్రీగురుధ్యానమ్

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః!

ఓం బ్రహ్మణే మూర్తిమతే శ్రితానాం శుద్ధిహేతవే।
నారాయణ యతీంద్రాయ తస్మై శ్రీగురవే నమః॥

ఓం నమశ్శివాయ గురవే సచ్చిదానందమూర్తయే!
నిష్ప్రపంచాయ శాంతాయ నిరాలంబాయ తేజసే ॥

## శ్రీపరబ్రహ్మ పంచరత్నమాలికా

ఓంకార సూచితం దేవం సర్వజ్ఞం సర్వసాక్షిణమ్।
అద్వయం పరమం వందే పరబ్రహ్మాణమీశ్వరమ్॥

పరాత్పరం సర్వశక్తి సంపన్నం నిత్యమవ్యయమ్।
అద్వయం పరమం వందే పరబ్రహ్మాణమీశ్వరమ్॥

రజస్సత్త్వతమోఽతీతం సర్వవ్యాపినమాత్మగమ్।
అద్వయం పరమం వందే పరబ్రహ్మాణమీశ్వరమ్॥

బ్రహ్మ విష్ణు శివాతీతం నిరాకారం చ నిర్గుణమ్।
అద్వయం పరమం వందే పరబ్రహ్మాణమీశ్వరమ్॥

మహాంతం పరమాత్మానం సచ్చిదానందలక్షణమ్।
అద్వయం పరమం వందే పరబ్రహ్మాణమీశ్వరమ్॥

# "ఓంకారమేవేదం సర్వమ్"

పరమపావనాత్ములగు ఓ సోదరీమణులారా! పాపరహితులగు సోదరోత్తములారా! అమృతాత్ములారా! దైవాత్మస్వరూపులారా! కరుణాళువులారా! ఓంకారముయొక్క పరమరహస్యమును, మహిమయు, మాధుర్యమును, ధ్యానించువారు పొందెడు శాశ్వతతమ ముక్తియు, ధ్యానము చేయు పద్ధతియు, ధ్యానించువారియొక్క అధికారమును ముముక్షువులందరును గ్రహించవలసిన విషయములలో ముఖ్య విషయము గదా! కనుకనే మొట్టమొదట అక్షరాభ్యాసకాలములో ఓనమాలు నేర్పెడు రహస్యమైయున్నది. పరమ కారుణికులగు మహర్షులు మనుష్యమాత్రులందరు నిట్టి ఓంకార రహస్యము తెలిసికొనందగినదని నిశ్చయించి వేదములకు మూలమైన మహామంత్రమును మొట్టమొదట జనులందరికిని నేర్పబూనిరి. దానివలన వీరందరును అట్టి ఓంకారమును అవశ్యముగా నెరుంగ తగినవారలని వేరు చెప్పంబనిలేదు. దీనికి అక్షరాభ్యాసమనియు, విద్యాభ్యాసమనియ దివ్యనామములను ఏర్పాటు చేసిరి. అక్షర, విద్యలయొక్క అర్థమును మనము గ్రహించతగినదిగదా? ఈ రెండు పదములను వేరు వేరుగా విభజించి చెప్పునప్పుడు అక్షరాభ్యాసమనియు, విద్యాభ్యాసమనియు చెప్పవచ్చు. లేక రెండు పదములను కలిపి చెప్పినచో "అక్షరవిద్యాభ్యాసము" అని గూడ వచింపవచ్చును. అక్షర విద్యాభ్యాసమనగా అక్షరవిద్యయొక్క అభ్యాసము. అక్షర విద్య యనగా అక్షరమైన విద్య అనందగును. అక్షర మనగా క్షరము కానిది. "క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే" అని గీతావచనము. అనగా చరాచర జగత్తంతయు క్షరమనియు, కూటస్థుడొక్కడే ఆత్మ యనియును, అక్షరుడనియు తేలుచున్నది. భూర్భువాది సత్యలోకము వరకును, అతల వితలములాదిగాగల పాతాళలోకములును వానిలోగల శరీరోపాధులును క్షరములే, అనగా నశ్వరములే. వేయేల? త్రిమూర్తులయొక్క ఉపాధులును, వారి బ్రహ్మలోక వైకుంఠలోక కైలాస లోకములును క్షరములయందు చేరినవి అని గ్రహించవలయును. ఇందుకు తార్కాణము

బ్రహ్మప్రళయు, విష్ణుప్రళయు, రుద్ర ప్రళయుములు అని శాస్త్రమందు పేర్కొనబడుటయే. ప్రేమ స్వరూపులారా! ఇప్పుడు మీరు అభ్యసించునది క్షర, అనగా నశించు దానియొక్క అభ్యాసమా? లేక అక్షర అనగా నాశరహితమైన బ్రహ్మవిద్యయా? అని ఒక్కొక్కరును దీర్ఘముగా చింతన చేయుటకు మనస్సున కవకాశమిండు. మీకు ఉపాధ్యాయులు ప్రథమమున అక్షరాభ్యాసమని చెప్పి క్షరాభ్యాసములు నేర్పవచ్చునా; ఇక రెండవది విద్యాభ్యాసము, విద్యాభ్యాసపమనగా విద్యయొక్క అభ్యాసము. విద్య అనగా అవిద్య కానిది విద్య యనంబడును. కావుననే గీత యందు ''అధ్యాత్మవిద్యా విద్యానాం'' అని శ్రీకృష్ణమూర్తి బోధించి యున్నారు. అట్టి ఆత్మవిద్య ఒకటి మాత్రము విద్యయగును గాని తక్కినవన్నియు అవిద్యయే యగును. అవిద్య, మాయ, అజ్ఞానము, ప్రకృతి అని చెప్పంబడునవి యన్నియు అవిద్యయొక్క పర్యాయవాచకములే. ఇట్టి అవిద్యలేని ఏ బ్రహ్మము కలదో దానియొక్క అభ్యామే విద్యాభ్యాస మనంబడును.

మీరు వేదవేదాంగములను సాంగముగా చదివినను, శతావర్షావధి జీవించినను పై చెప్పిన అక్షరము, లేక విద్యయొక్క యథార్థమును తెలుసుకొనుటకు ప్రారంభించని కాలమువరకు అక్షరాభ్యాసము చేయని పసికూనలవంటివారని సర్వదా మరువక యుందురేని ధన్యాత్ములే, సంశయము లేదు. ఈవిషయమై ముందు విస్తారముగా జెప్పబడును. ఇట్టి పరమ పవిత్రమైన అక్షరాభ్యాసము తెలియకగదా అనేక శాస్త్రములను జదివినవారును, గొప్పగొప్ప పరీక్షలలో ఉత్తీర్ణులైనవారును అవిద్యకమైన కర్మకడలిలో మునిగి దిక్కుతెలియక ఊపిరియాడక సంకటపడుచున్నారు. వీరు తాపత్రయాగ్నిచే తపించిన వారలై ఘోరు ఘోరు ఘోరుమని దుఃఖరోదనము చేయుచున్నారు. మరల మరల కర్మకానన మధ్యలో చిక్కుకొని దిగ్భ్రమచెందినవారలై స్తబ్ధులై వణకుచున్నారు. కావున అక్షరాభ్యాసమని చెప్పి క్షరాభ్యాసమును నేర్పువారిని, విద్యాభ్యాసమని చెప్పి అవిద్యను నేర్పువారిని చేరక అక్షరమను విద్యను నేర్పు యథార్థగురువులను త్వరలో ప్రాపించి మీరు వృద్ధులైనను లేక వేద వేదాంగములను కడవరకు

చదివినవారైనను, అభిమాన గర్వములను అణచిపెట్టి వినయ విధేయ నిర్మల గుణములు గలవారలై, చిన్నపిల్ల వారివలె మహాత్ముల దగ్గర చేరి పోయినకాలమును గురించి పరితాపము గలవారై, అక్షరాభ్యాసమును నేర్చుకొని తరింతురు గాక! ఆత్మనిష్ఠాపరులైన మహాత్ములు లోకవాడుక చొప్పున (క్షరాభ్యాసమైన) అక్షరాభ్యాసము లేనివారలైనను అట్టి మహాపురుషులను చిన్న బుద్ధితో చూడకుడు.

**క్షరః సర్వాణి భూతాని సూత్రాత్మాఽక్షర ఉచ్యతే।**

**అక్షరం పరమం బ్రహ్మ నిర్విశేషం నిరంజనమ్॥**

అని యోగశిఖోపనిషత్తు. శ్రీభగవాన్ రామకృష్ణ పరమహంసలే దీనికి దృష్టాంతము. ఆ మహాపురుషుడు లోకములో గల విద్యాభ్యాసమును చేయనొల్లక విద్యాస్వరూపిణియైన శ్రీకాళికాదేవిని పరబ్రహ్మస్వరూపిణిగా నెఱింగి దృఢముగ నభ్యసించినందున లోకములోగల సర్వకళా విద్యా పారంగతులకు అక్షరాభ్యాసము నేర్పుటకు శక్తిమంతుడై ప్రకాశించెను. శ్రీవాల్మీకి మహర్షియు, శ్రీకాళిదాసమహాకవియు నిట్టి విద్యనే అభ్యసించిరి. కనుకనే వారు ఆత్మ విద్యయందు విద్వాంసులైరి. మరియు పెక్కండ్రు ఇట్టి విద్యచే అవిద్యను దాటినవారలైరి. ఐనను ఇది సామాన్యజనులకు సాధ్యమని తలంపరాదు. బహుజన్మ సంస్కారము గలవారికి మాత్రమే సిద్ధించును. తక్కినవారు ఉత్తమ గురుకులవాసము చేసుకొని పూర్వికఋషి సాంప్రదాయము ననుసరించి సాధనానుష్ఠానములతోకూడ విద్యాభ్యాసము అవశ్యముగా చేయవలయును. ప్రస్తుత కాలమనుసరించిన ఆంగ్లేయ విద్యను, ఋషికులవిద్యను అనుసరించి అభ్యసించవచ్చును. పై చెప్పిన విద్యాభ్యాసములు చిత్తైకాగ్రత నొందుటకు సహాయపడును. చిత్తవిరోధము గలుగని వారికి పై జెప్పిన ఓంకారాభ్యాసము అలవడుట దుస్తరము. మనస్సులో వృత్తులుండువరకును బహిర్ముఖముగా హృదయము తిరిగి యుండును. వారికి బ్రహ్మనిష్ఠలో అనగా ధారణ ధ్యానములలో లేక మనన నిదిధ్యాసనములలో ప్రవేశము గలుగదు. వృత్తి నశించునప్పుడు మనస్సు అంతర్ముఖముగా మరలుచుండును. అప్పుడు మాత్రము స్వరూపాను సంధానము సిద్ధించును.

అనగా తత్త్వమస్యాది మహావాక్య శ్రవణ స్వరూప మందు సుస్థిరత కుదురును. దర్పణము దృశ్యమువైపున త్రిప్పిన దానియందు ప్రపంచము ప్రతిబింబించును. కాని మన శరీరము కనపడదు. మన ముఖము ప్రక్కకు అద్దమును మరలించిన లోకము కనపడక మన దేహము కానుపించునుగదా? అట్లే మనస్సు ఊర్ధ్వగామిగా నుండునప్పుడు ఆత్మ దర్శనము అనగా ఆత్మసాక్షాత్కారము గలుగును. మనస్సు అధోముఖముగా నుండు కాలములో ఆత్మను అనగా దైవమును నెరుంగజాలరు. ఇట్టి అవస్థనే ఊర్ధ్వకుండలి యనియు, అధఃకుండలి యనియు గ్రహించవలయును.

అంతేగాక యోగులమని చెప్పుకొనువారు కొందరు ఆ కుంచనా భ్యాసముచే మూలాధారమునుండి కొన్ని నాడీమండలములను ప్రాణాయామ సహాయముచే పైకి లేపవలయునని చెప్పెడు అంధ విశ్వాసమునకు మీరు హృదయములో చోటు ఇవ్వకూడదు. ఆ కుంచనాభ్యాసము, ప్రాణాయా మము చాలా పవిత్రములైనవి. వీటివల్ల బుద్ధి సూక్ష్మతయు, ఇంద్రియ శుద్ధియు, ఏకాగ్రతయు సులభముగా గలుగును. శరీరమునకు మంచి ఆరోగ్యము కూడ సిద్ధించును. మనః సంయమమునకు చాల సహాయ మేర్పడును. నిప్పును గాలియు కలియునప్పుడు ఎటువంటి కట్టెలైనను కాలునట్లు మనోమారుతముల ఐక్యముచే కర్మకట్టెలు త్వరలో దహించిపోవును. ఆకుంచనాభ్యాసమువలన మనస్సును, కొంత ప్రాణశక్తిని సహస్రారమునకు తీసుకొనిపోవుటకు మంచిసహాయము కలుగును. ఈ ప్రాణములోను ఆ కుంచనములోను ఓంకారమును కలిపి అభ్యసించవలయును. నిశ్చలమైన ధ్యానమునకు ఓంకారము తప్ప వేరేమంత్రముపయోగపడదు. తక్కినవి స్మరించుటకు హృదయములో కొంచెమైన చలనముండియే తీరవలయును. అట్లయిన అచలత్వమెట్లు సిద్ధించును? మరియొక రహస్యము గలదు. ప్రాణప్రయాణకాలములో కొందరికి ఇంద్రియములకు అవశత్వము కలుగవచ్చును. అప్పుడు ఇతర మంత్రములు వేనిని స్మరించుటకు శక్తియుండదు. ఓంకారము మాత్రము భావనామంత్రమగుటచే సాధ్యపడును. గనుకనే ''ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః'' అంత్యకాలమున

నియుతాత్మ్మలచేత నేలాగున ధ్యానింపదగుదువు? అను ప్రశ్నకు శ్రీకృష్ణపరమాత్మ్మడు గీత అష్టమాధ్యాయమున ఈ ఓంకారమునే బోధించి యున్నారు. ఈ భాగము శ్రీగీతలో బాగుగా చూడుడు.

అంతేగాక ఓంకార మొక్కటిమాత్రమే ద్వైత తాపోపశమనమును గలుగచేయును. ఏలన? తక్కిన మంత్రములన్నియు ప్రత్యేక శివవిష్ణ్వాది దేవతలను గురించి చెప్పుచుండును. కనుకనే అట్టి మంత్రములకు స్త్రీలింగముగాని, నపుంసకలింగముగాని కానుపించుటకు కారణము. లింగభేదము ప్రకృతితో గూడినదేగాని ప్రకృతిరహితమును గోచరింపచేయునది కాదు. కావుననే శైవవైష్ణవాది మతభేద బాధకు కారణమగుచున్నది.మరియు ప్రణవేతర మంత్రములు ప్రథమాది విభక్తులతో గూడియుండును. అఖండైక స్వరూపముగా నుండవు. ఓంకారము అటువంటి సంకుతభావము గలది కాదు. అది ఏకవచనాదులతోను, పుంలింగాదులతోను, సంబోధనాది విభక్తులతోను గూడియుండలేదు. కనుకనే ప్రణవోపాసకులకు అఖండైక బోధకమగు అద్వైతజ్ఞానము కలుగుచున్నది. ఇట్టి ప్రణవోపాసన లేనివారికి సమరస జ్ఞానము గలుగకపోవుచేతగదా మతభ్రాంత్యంధతమోఽ రణ్యములో చిక్కుకొని, పవిత్రమైన లోకమును భ్రాంత్యాస్పత్రిగా భావించి విభ్రాంతులగుచున్నారు. ఓంకారము మాణిక్యము వంటిది. మంత్రములు రత్నముల వంటివి. కీర్తన భజనలు బంగారు వంటివనందగును. పారాయణాదులు రూప్యములవంటివని చెప్పవచ్చును. ప్రదక్షిణ నమస్కారాదులు రాగి నాణెములవంటివని గ్రహించవలయును. ఇంకొక రహస్యము చెప్పద. అర్చన, పూజా, హోమాదులు స్థూలదేహమునకు సంబంధించినవి. అనగా కరాది ఇంద్రియములతో చేయునవి. ప్రార్థన, కీర్తన, స్మరణాదులు సూక్ష్మదేహము నంటియుండును. ధారణ ధ్యానములు కారణదేహముతో చేరియుండును. ఇచ్చటికి ఓంకారము మాత్రమే వెళ్ళును. ఈ కారణదేహపర్యంతము మూల ప్రకృతి కూడియుండును. ధ్యేయాకారము ఈ మూడింటికి అవలనుండునని మరువకూడదు. అదే తురీయము. ఇది ప్రణవముయొక్క నాల్గవపాదము. దీని ఉపాధిని తొలిగించిన అదే

తురీయాతీతమై మారును. పై చెప్పిన అనుష్ఠానములకు ఒక్కొక్కదానికి సహస్రాంశాధిక ఫలము కలదు. కనుకనే:-

**పూజాకోటిసమం స్తోత్రం స్తోత్రకోటిస మో జపః॥**

**జపకోటిసమం ధ్యానం ధ్యానకోటిసమో లయః ॥**

అని చెప్పు రహస్యము. దీని అర్థము సులలితము. ఇక జప భేదమును చెప్పెద.

**విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణై ః**

**ఉపాంశుస్స్యాచ్ఛతగుణః సాహస్రో మానసస్స్మృతః॥**

విధిప్రకారము చేయు యజ్ఞమునకన్న పదిభాగములు ఫల మధిక మిచ్చునది జపము. అట్టి జపమును వాచా శబ్దము చేయక కంఠకుహరమున చేయుటచే నూరుభాగములు ఫలమధికము. కంఠమును, దంతోష్ఠములను కదలింపక హృదయమున ధ్యానించుటచే వేయిభాగములు ఫలమధికము, (మనుస్మృతి)

**త్రివిధో జపయజ్ఞః స్యాత్తత్ర భేదాన్నిబోధత।**

**వాచికశ్చ ఉపాంశుశ్చ మానసస్త్రివిధస్స్మృతః॥**

మఱియు జపములు మూడువిధములు, వాని భేదములను వినుడు: వాచికమనియు, ఉపాంశువు అనియు (అనగా కొండనాలుక సమీపమున జపించుట), మనస్సులో జపించుటయునని త్రివిధముగా చెప్పబడును.

**ఉత్తమం మానసం జాప్యముపాంశుర్మధ్యమం స్మృతమ్।**

**అధమం వాచికం ప్రాహుః సర్వమంత్రేషు వై ద్విజాః॥**

ఆ జపములలో మానసిక ముత్తమము, ఉపాంశువు మధ్యమము, వాచిక మధమమని మహర్షులు చెప్పెదరు. ఈ విధి మంత్రముల కన్నిటికిని సమమని బ్రహ్మవేత్తలు చెప్పియున్నారు.

**ఉచ్చైర్జపాదుపాంశుశ్చ సహస్రగుణ ఉచ్యతే।**

**మానసస్తు తతోపాంశోస్సహస్రగుణ ఉచ్యతే॥**

వాచాజపము అనగా ఇతరులు వినేలాగున ఉచ్చరించుమంత్రము వాచిక మనబడును. ఇది వెయ్యింటికి ఉపాంశుజపము ఒక్కటి సరిపోవును,

ఉపాంశుజపసహస్రమునకు మానసిక మొకటి చాలునని నూతసంహిత చెప్పు చున్నది. ఐనను ఓంకారము ధ్యానించుటకు కొంత అర్హత యుండవలయునని ముందు చెప్పబడియున్నదిగదా; మంత్రములు గొప్పవని తలంపరాదు. మననమే గొప్పది. సత్త్వాదిగుణభక్తి, విరక్తి, కరుణ, శాంతి గలిగి స్వరూపానుసంధానము చేయువారికి గొప్ప లాభము గలుగునేగాని తదితరుల కిసుమంతయు ప్రయోజనముండదు. భక్తి గొప్పదిగా గలవారు వారివారి యిష్టానుకూల దైవస్మరణ చేయవచ్చును. స్మరణ యేకాగ్రత చెందునప్పుడు సర్వేంద్రియములు స్తంభితములగును. అప్పుడు నిశ్చేష్టుడై ధ్యేయాకారవృత్తితో గూడియుండును. శాస్త్రము సామాన్యవిధినే బోధించును. విశేషస్థితి యనుభవజ్ఞులదై యున్నది. ప్రణవోపాసన గొప్పదని తలంచి అర్హతలేనివారు ప్రయత్నించిన దైవామృతరసమును పానము చేయనొల్లరు. ఇచ్చోనొక రహస్యము గలదు. రాజప్రతినిధియగు వైస్రాయి గారి పని గొప్పదైనందున దానికి తగిన అర్హతకూడ నుండవలయును. దాని క్రిందనుండు గవర్నరు, కలెక్టరు మొదలైన వారి యుద్యోగములు చిన్నవని తలంపరాదు. మరియు లోకములో గవర్నర్లు ఎంతమంది యున్నారనునదియు నూహించవలయును. సామాన్య ఉద్యోగములో నున్నవారితో 'ఈ చిన్నపని యెందుకు? గవర్నరు పనిలో ప్రవేశించరాదా?' అని ఉద్బోధించి ఉన్నపని కూడా పోగొట్టింపచూ డకుడు. మీరును భ్రమనొందకుడు. మరియు సాధారణ భోజనము చేయువారితో 'ఈ అన్నము, సంగటి కూరలు మంచివి కావు, రాజాధిరాజులు ఎటువంటి శుద్ధమైన క్షీరాన్నాది భోజనపదార్థములు భుజించుచున్నారో తెలుసా' అని చెప్పి సామాన్యముగా భుజించెడు భోజనములను గూడపోగొట్టి యుపవాసముండునట్లు చేయకుడు. రారాజుల స్థానము ప్రాప్తమగునప్పుడు దానికి తగిన పరిస్థితులన్నియు సమకూడును. మన ప్రయత్నము పనిలేదు. లేక పై చెప్పినట్లు చెప్పువారు పైన ఉదాహరించిన ఉన్నతోద్యోగమును పరిశుద్ధభో జనమును ఇచ్చుటకు శక్తి గలవారలై యుండవలయును. అది లేనిచో వ్యర్థప్రలాపము, అపాయకరము. వారు జనులకు మంచిని గలుగచేయు చున్నారని తోచినను చెరుపే చేయుచున్నారు. కావున బోధకుడు అధికారిని

కనుగొన శక్తిగలవాడై ఉండవలయును. వీరు మంచి డాక్టరువలెను, గొప్ప ఉపాధ్యాయునివలెను నుండవలయును. ఏయేరోగి కెట్టి వైద్యము, పథ్యము ఉండవలయునో, ఏ తరగతి జదువుటకు ఎట్టివారు అర్హులో తెలిసియుం డవలయును. ఇచ్చట అధికారి శబ్దము సంస్కారము ననుసరించి యుండునని గ్రహించేది. లేనిచో పై శాచికకృత్యమునకు లోబడిపోవును. అనగా కులగోత్రములను ప్రధానముగ చూడక గుణకర్మలను చూడవలెనని భావము. ఇది బ్రహ్మనిష్ఠాపద్ధతికి మాత్రము చెందినదిగాని, లోక వ్యహారమునకు సంబంధించినది కాదని మరువకూడదు. ఇప్పుడు ఓంకారమును గురించి చెప్పుటలో మనస్సును ప్రవేశపెట్టెద.

**ఓఙ్కారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా।**
**కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికా వుభౌ।**

సృష్ట్యాదిన బ్రహ్మదేవుని కంఠమునుండి వెలువడిన శబ్దములు రెండు. మొదటిది ''ఓం'' కారము. రెండవది 'అథ' అనెడు శబ్దము. కావున ఇవి రెండును పరమపవిత్రములైన మంగళశబ్దములు, అనగా విధాత చిరకాలము చింతించిన తర్వాత ప్రప్రథమమున ఓంకారమునే ఉచ్చరించెను. అనగా ఏ యొక్క పరమాత్మ శక్తిచేత తాను సృష్టికి శక్తిమంతుడాయెనో, అట్టి పర బ్రహ్మము యొక్క స్వరూపము ఓంకారమనియు, అదే సర్వజనులకేగాక దేవతలందరికి కూడ ధ్యేయమనియు తెలిపిరట. చతుర్ముఖుండు ఓంకారము నుచ్చరించుకొని పరబ్రహ్మమును ధ్యానించెనని అర్థము. అనగా సర్వేశ్వరుడు నామరూపరహితుడై, సజాతీయ విజాతీయ స్వగతభేదము లేనివాడై , అఖండైకరసమైయున్నాడని దేవతలకు తెలిపెనని భావము. కావుననే వేద సంబంధములను పఠించునప్పుడు ఓంకారము స్మరించుటకు కారణము. ఈ రహస్యమును బట్టియే అక్షరాభ్యాసకాలమున మొట్టమొదట ఓంకారము నేర్పడి రహస్యము. అందరికి అప్పుడే బ్రహ్మోపదేశము చేయబడెను. రెండవది యగు అథ అను శబ్దము స్మృత్యాది పురాణ గ్రంథములలో ప్రథమమున పఠింపబడును. ఉపనిషత్తులలోను ప్రారంభమున 'అథ' అను శబ్దము కానుపించుచున్నది. శ్రీబాదరాయణ మునీంద్రులు బ్రహ్మసూత్రములో

''అథాతో బ్రహ్మజిజ్ఞాసా'' అనియు, శ్రీపతంజలిమహర్షి తన విరచితయోగ సూత్రములలో ''అథ యోగాను శాసనం'' అనియు వచించియున్నారు. ఇవి రెండును పరమ పవిత్ర వచనములే గాక వీటి స్మరణచే నిర్విఘ్నముగా గ్రంథ సమాప్తి గలుగును. మరియు విరచిత దోషములుండిన అవియును శమించు ను. ఇప్పుడు ఓంకారముయొక్క స్వరూపము చెప్పబడుచున్నది.

**ప్రథమం తారకం చైవ ద్వితీయం దండముచ్యతే!**
**తృతీయం కుండలాకారం చతుర్థం త్వర్ధచంద్రకమ్!**
**పంచమం బిందుసంయుక్తం ఓమితి జ్యోతిరూపకమ్!**

(1) తారకాకారము (2) దండాకారము, (3) కుండలాకారము, (4) అర్ధచంద్రాకారము, (5) బిందురూపము వీనితోగూడిన ఓంకారము జ్యోతిరూపమై యున్నది. ''ఆదిత్యవర్ణం తమసస్తు పారే'' అను శ్రుతి ననుసరించి ప్రపంచమునకు పరమై జ్ఞానజ్యోతియై వెలుగుచుండునదే పర బ్రహ్మము.

**మూ ॥ త్రయః కాలాస్త్రయో దేవాస్త్రయో లోకాస్త్రయః స్వరాః।**
**త్రయో వేదాః స్థితా యత్ర తత్పరం జ్యోతిరోమితి ॥**

దేనియందు కాలత్రయము, దేవతాత్రయము, లోకత్రయము, స్వరత్రయము, వేదత్రయము స్థితములైయున్నవో అట్టి పరంజ్యోతి స్వరూపము ఓంకారం అనగా భూత భవిష్యద్వర్తమాన కాలమును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలును, భూర్భువాది లోకత్రయమును, హ్రస్వ దీర్ఘప్లుతాది వేదస్వరములును, ఋక్కుయజుస్సు సామాది వేదములును ఏ పరమాత్మనుండి కలిగినవో అట్టి స్వరూపమే ప్రణవశబ్దము యొక్క అర్థము. ఈ శబ్దార్థమును అథర్వశిఖోపనిషత్తులో వివరించిన ప్రకారము చూడుడు.

**మూ॥ సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః॥**

ఒక్కమారు ఓంకారమును ఉచ్చరించినమాత్రముచే ఊర్ధ్వగతిని అనగా ప్రకృతికి పరమైన పరమపదమును లేక ప్రపంచాతీతస్థితిని గలుగ చేయుటంబట్టి '' ఓం'' కారమని పేరు గలిగినది.

సోదరీ సోదరులారా! తన్మయస్థితి గలుగవలయుననిన నిట్టి ఓంకారో

పాసన తప్ప వేరు మార్గము లేదు. ఏలన? శబ్దము ప్రకృతితో గూడినది గనుకనే '' నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే''అని చెప్పురహస్యము. ఇట్టి రహస్యము ధారణ ధ్యాన సమాధులను అభ్యసించెడివారికి స్వయముగా గోచరించును. ఇది పరమ శాంతి నిలయము, అనందము, అమృతము, శివము, అద్వైతము, పూర్ణము, అచలము. ఇట్టి స్థితి నొందగోరువారందరును సద్గురువుల ననుసరించి దీని భావమును గ్రహించవలయును. దీని నుచ్చరించునప్పుడు, ప్రాణము ఊర్ధ్వముగా పోవునేగాని అధోముఖముగా తిరుగదు. కనుకనే అంత్యకాలములో''ఓమ్'' కారమును స్మరించి దేహమును విడుచువారు బ్రహ్మమునొందగలుగదురని శ్రీకృష్ణపరమాత్ములు గీత అష్టమాధ్యాయము లో నుపదేశించిన రహస్యము.

ఇక ప్రణవశబ్దమునకు అర్థము చెప్పబడుచున్నది. ఓంకారమనియు. ప్రణవమనియు రెండు పేర్లు దీనికి గలవు.

**మూ॥ ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవ ః**

సకల ప్రాణములను అనగా పంచ ప్రాణములను, ఉపప్రాణములను లేక ఆత్మను పరమాత్మయందు చేర్చుటంబట్టి ప్రణవమనంబడును. ప్రణవ ధ్యానమందు మాత్రమే ప్రాణలయము అనగా జీవబ్రహ్మైక్యము కలుగును. ప్రకృతిరహితావస్థత సిద్ధించునని భావము. కనుకనే ప్రాణాయామము చేయువారు ఓంకారములో ఐక్యపరచి శీలించుచున్నారు. ఇది వేదమూలము. దీనిని ధ్యానించుటచే నాలుగు వేదములు జదివిన ఫలమును, త్రిమూర్తులనే గాక సర్వదేవతలను పూజించిన ఫలము గలుగునని భావము. ఉత్తరగీత యందు ఓంకారము చెప్పబడియున్నది. ఈ శ్లోకము ఉపనిషత్తులో గలదు.

**అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్।**
**ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః॥**

ఈ ఓంకారమునకు యెనిమిది అంగములు, నాల్గు పాదములు, మూడు స్థానములు, పంచ దైవతములు గలవని యెరుంగ వలయును. ఇట్టి ఓంకారమును ఎరుంగనివాడు బ్రాహ్మణ శబ్దమున కర్హుడు కాడు. అనగా బ్రహ్మము నెరుంగజాలడని భావము. అష్టాంగమనగా జీవుని అంగములు

నాలుగు: (1)విశ్వుడు, (2)తైజసుడు, (3)ప్రాజ్ఞుడు, (4) ప్రత్యగాత్మ, ఈశ్వరుని అంగములు నాలుగు, (1) విరాట్ (2) హిరణ్యగర్భ, (3) అవ్యాకృత, (4) పరమాత్మ, ఇవి అష్టాంగములు, చతుష్పాదమనగా (1) అకారము, (2) ఉకారము, (3) మకారము, (4) అర్ధమాత్రకము, త్రిస్థానము: (1) జాగ్రదవస్థ, (2) స్వప్నావస్థ, (3) సుషుప్తావస్థ. పంచదైవతములు: (1) బ్రహ్మ, (2) విష్ణు, (3) రుద్ర, (4) సదాశివ, (5) మహేశ్వరులు. అనగా ఈ ఓంకారధ్యానముచేత చరాచర బ్రహ్మాండమంతయు ఈశ్వరమయమను జ్ఞానము గలుగును.

ఓంకారమును గురించి శ్రుతి-స్మృతులలో అసంఖ్యాకములుగా చెప్పబడియున్నవి. అథర్వశిఖోప నిషత్తులో ఓంకారమును గురించియే చెప్పబడెను. ఈ ఉపనిషత్తు వ్రాసిన తర్వాత తక్కినవి వ్రాయబడెను. పైప్పలాదుడు, అంగిరసుడు, సన త్కుమారుడు అనే పేర్లుగల మహర్షి పుంగవులు ఓంకారమును గురించియు, ధ్యేయవస్తువును గురించియు. అథర్వశిఖుడను పేరుగల ఒక గొప్ప మునిపుంగవుని అడిగిన విషయము ఈ అథర్వ శిఖోపనిషత్ప్రతిపాద్యము.

అథర్వవేదా న్తర్గత

# అథర్వశిఖోపనిషత్తు

అవతారిక॥ ఇప్పుడు ''ఆఖ్యాయిక'' అను పద్ధతి ననుసరించి ప్రథమమునందు ప్రణవవిద్యను నిరూపించుచున్నాడు.

**మూ॥ హరిః ఓమ్॥ అథ హైనం పైప్పలాదోఽఙ్గిరాః సనత్కుమా రశ్చాథర్వణముబాచ॥**

అనంతరము పైప్పలాదుడును, అంగిరసుడును, సనత్కుమా రుడును అథర్వణ మునిని జూచి ప్రశ్నించిరి.

పైప్పలాదుడు-పిప్పలాదుని కుమారుడు, దధీచిముని పౌత్రుడు, అథర్వుని ప్రపౌత్రుడు. అంగిరసుడు-సత్యవాహనుడని ప్రసిద్ధినొందిన భారద్వాజుని శిష్యుడు, సనత్కుమారుడు-బ్రహ్మదేవుని కుమారుడు. మహాత్ములగు పైప్పలాదులు ప్రశ్నించిన విషయమిట్టిదని చెప్పుచున్నాడు.

**మూ॥ భగవన్ కిం తదాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యమ్।**
**కిం తద్ధ్యానం కో వా ధ్యాతా కశ్చ ధ్యేయః॥**

ఓ భగవంతుడా! ఆదికాలమునందు (సృష్టియందు) బ్రహ్మాది దేవతలు ఉపయోగించినది ఏది? ధ్యానము ఏది? ధ్యానింప దగినది ఏది? ధ్యానమునకు సాధనమెయ్యది?? ధ్యాత ఎవడు? మంత్రముచే దెలిసికొనద గినది (ధ్యేయము) ఏది? అని పైప్పలాదులు అథర్వణుని జూచి యడిగిరి.

అవ॥ మీద చెప్పిన ఆరు ప్రశ్నములకును ఉత్తరము చెప్పబడుచున్నది.

**మూ॥ స ఏభ్యోఽథర్వా ప్రత్యువాచ ఓమిత్యక్షరమేతదాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యమ్॥**

ఆపైప్పలాదులకు అథర్వణ ఋషి యిట్లని యుపదేశించెను. ప్రణవాక్షరమే ఆదియందు ఉపదేశింపబడినది. అదియే ధ్యానము, దానినే ధ్యానింపవలయును.

అవ॥ ఆ ప్రణవాక్షర మహిమను నిరూపించుచున్నాడు.

**మూ॥ ఏతదక్షరం పరం బ్రహ్మ అస్య పాదాశ్చత్వారో వేదాః చతు ష్పాదిదమక్షరం పరం బ్రహ్మ॥**

ఈ ప్రణవాక్షరము (ఓంకారము) పరబ్రహ్మ స్వరూపము. ఓంకారము యొక్క నాలుగు పాదములును (అంశములను) ఋగాది నాలుగు వేదములు, నాలుగు పాదములతో గూడిన యీ ప్రణవము పరబ్రహ్మస్వరూపము. అనగా నాలుగు వేదములయందేయర్థము కలదో అది యీ ప్రణవము నందే కలదు. కాబట్టి యీ అక్షరమే ముముక్షువులకు ఉపాస్యమైనది.

అవ॥ ప్రథమపాదము (ఋగ్వేద) మహిమను ప్రశంసించుచున్నాడు.

**మూ॥పూర్వాఽస్య మా త్రాపృథివ్యకారః స ఋగ్భిః ఋగ్వేదో బ్రహ్మ వసవో గాయత్రీ గార్హపత్యః॥**

ఓంకారముయొక్క మొదటి మాత్ర ఆకారము. దీనికి భూతము (లేక లోకము పృథివి, ఇది ఋక్కులతో, పాదవ్యవస్థగల మంత్రములతో) గూడినది. దీనికి ఆదిదేవత బ్రహ్మదేవుడు. దీనికి పితృ దేవతలు అష్టవసువులు, గాయత్రి ఛందస్సు, గార్హపత్యాగ్ని.

అవ॥ ఇప్పుడు ద్వితీయపాద యజార్వేద లక్షణమును జెప్పుచున్నాడు.–

**మూ॥ ద్వితీయా న్తరిక్షం స ఉకారః స యజార్భిర్యజార్వేదో విష్ణూ రుద్రా త్రిష్టుప్ దక్షిణాగ్నిః॥**

ప్రణవముయొక్క ద్వితీయమాత్ర ఉకారము. దీనికి భూతము (లేక లోకము) ఆకాశము. యజాస్సులతో (పాదవ్యవస్థలు లేనివానితో) గూడినది. యజార్వేదమునకు విష్ణువు అధిదేవత, ఏకాదశ రుద్రులు పితృదేవతలు త్రిష్టుప్ ఛందస్సు, దక్షిణాగ్ని.

అవ॥ ఇక తృతీయపాద (సామవేద) లక్షణమును జెప్పుచున్నాడు.

**మూ॥ తృతీయాద్యౌస్స మకారః స సామభిస్సామవేదః, రుద్ర ఆదిత్యాః జగత్యాహవనీయః॥**

ఓంకారముయొక్క మూడవమాత్ర మకారము. దీనికి లోకము స్వర్గము. సామములతో (స్వరములతో) గూడినది. రుద్రుడు అధిదేవత.

ద్వాదశాదిత్యులు పితృ దేవతలు, జగతి ఛందస్సు, అహవనీయాగ్ని, ఋగ్యజా స్సామములు మూడును వరుసగా భూః భువః సువః అనబడును. భూః- భూలోకము, భువః- అంతరిక్షలోకము, సువః- స్వర్గలోకము.

అవ॥ ఇక ఓంకారముయొక్క నాలుగవపాదమైన అర్ధమాత్రను (అథర్వవేదమును) గూర్చి చెప్పుచున్నాడు.

**మూ॥ యాఽవసానేఽస్య చతుర్థ్యర్ధమాత్రా సా సోమలోకఓంకారః**
**సాథర్వణ మన్త్రైరథర్వవేదః సంవర్తకోఽగ్నిః మరుతో**
**విరాట్ ఏకర్షిః భాస్వతీ స్మృతాః॥**

ఓంకారముయొక్క కడపటిదియు నాల్గవదియునగు అర్ధమాత్ర సోమలోకము, ఓంకారము. అది అథర్వవేదము. సంవర్తకాగ్ని, మరుత్తులు, విరాట్టు ఛందస్సు, ఏకఋషి భాస్వతి అనబడును. అకార ఉకార మకారములకు కడపట అతిసూక్ష్మమైయుండు అర్ధమాత్ర ఏదియో అదియే నాద స్వరూపము.

ఇచ్చట సోమలోక మనునది పరమేశ్వరస్థానము. చంద్రలోకమను నెడల స్వర్గలోకములో నంతర్భూతమగునుగాన పునరుక్తి దోషము సంభవించును.

అథర్వమంత్రములందు తరచుగా అర్ధమాత్రయే ప్రయోగింపబడినం దున అది యీ వేదమునకే తగినది.

సంవర్తకాగ్ని యనగా మహాగ్రాసమను పేరుగల తురీయపరమాత్మ. మరుత్తులనగా పితరులకు పితృస్థానమై యుండువారు. విరాట్ ఛందస్సు, అథర్వవేదులయొక్క అగ్ని ఏకఋషి యనబడును. భాస్వతి యనునది యొకా నొక శక్తి.

అవ॥ వర్ణస్వరూపాదులను బోధించుచున్నాడు:-

**మూ॥ప్రథమా రక్తాపీతా మహద్బ్రహ్మదైవత్యా, ద్వితీయా విద్యు**
**మతీ కృష్ణా విష్ణు దైవత్యా, తృతీయా శుభాశుభా శుక్లా రుద్ర**
**దైవత్యా, యాఽవసానేఽస్య చతుర్థ్యర్ధమాత్రా విద్యుమతీ**
**సర్వవర్ణా పురుషదైవత్యా॥**

మొదటిమాత్ర ఎఱ్ఱగానుండును దానిశక్తి పీతమనబడును. అనగా స్వర్ణకాంతి గలది. దీనికి అధిదేవత మహాత్ముడైన బ్రహ్మదేవుడు. రెండవ మాత్ర నల్లగా నుండును. దానిశక్తి విద్యుమతి యనబడును. అనగా మెరుపు వంటి కాంతిగలది. దీనికి అధిదేవత విష్ణుమూర్తి, మూడవమాత్ర తెల్లగా నుండును. దానిశక్తి శుభాశుభ అనబడును. అనగా తెల్లని కాంతిగలది. దీని కధిదేవత రుద్రమూర్తి. నాలుగవమాత్ర అర్ధమాత్ర లక్ష్మీదేవివంటి వర్ణము గలదిగానుండును. దానిశక్తి సకలవర్ణములతో గూడియుండును. దీని కధి దేవత పరమపురుషుడు అనగా పరమాత్మ. ఈ పురుషుని శైవులు రుద్రుడనియు, తక్కినవారు మహావిష్ణువనియు చెప్పుదురు.

అవ॥ ప్రణవస్వరూపమును జెప్పుచున్నాడు–

**మూ॥ ఏష హ్యోఙ్కారశ్చతురక్షరః చతుష్పాదః చతుశ్శిరశ్చతు**
**ర్ధమాత్రః॥**

ఇదే ఓంకారము. ఇది నాలుగు అక్షరములు గలది, నాలుగు పాదములు గలది, నాలుగు తలలు గలది, నాలుగు అర్ధమాత్రలు గలది.

తలలు అనగా శిరస్సు, ఇదే ప్రధానము, లేక దేవతలు అని యెరుంగ దగినది.

అవ॥ ఇక స్థూలప్రణవమును తెలియజేయుచున్నాడు–

**మూ॥ స్థూలమేతద్ధ్రస్వదీర్ఘప్లుతమితి ఓమ్, ఓమ్, ఓమ్.**

ఇది స్థూలమైనపుడు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని చెప్పబడును. ఓంకారము స్వభావముగానే దీర్ఘమైనందున మొదటి ఓంకారము దీర్ఘమనియు అనగా రెండుమాత్రలు గలదనియు, రెండవ ఓంకారము ప్లుతమనియు అనగా మూడుమాత్రలు గలదనియు, మూడవ ఓంకారము కాక పాదమనియు అనగా నాలుగుమాత్రలు గలదనియు నెఱుంగదగును. స్థూలప్రణవమనగా వైఖరీస్వరూపమైన ప్రణవము.

అవ॥ ఇప్పుడు ప్రణవోపాసనమును వివరించుచున్నాడు:–

**మూ॥ త్రిరుక్త్వా చతుర్థశ్శాన్త ఆత్మా ప్లుత ప్రణవప్రయోగేన సమస్త**
**మోమితి ప్రయుక్త ఆత్మజ్యోతిస్సకృదావర్తతే॥**

రెండు, మూడు, నాలుగు మాత్రలుగల ప్రణవమును క్రమముగా నుచ్చరించి నాలుగవ పర్యాయము ఐదుమాత్రలుగల ప్రణవమును ఉచ్చరింప వలయును. ఇట్లుపాసించినప్పుడు శాంతమైనదియు. ఆత్మయైనదియు. సమస్తమును ప్రణవమైనదియునగు ఆత్మజ్యోతి యొక్క మూరు ఆవర్తించును (ప్రకాశించును). ఓంకారమును క్రమక్రమముగా నుచ్చరించుచు (మాత్రలను వృద్ధిచేయుచు) నుపాసించునప్పుడు సర్వమును ప్రణవస్వరూపమనియు, అదియే పొందదగిన స్థానమనియు బోధమగును. ఇదే తారకయోగము. దీనిని అభ్యసించిన యోగి తానును ప్రణవస్వరూపుడగును.

అవ॥ ఓంకారమహిమను బోధించు చున్నాడు-

**మూ॥ సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః॥**

ఒక్కమారు ప్రణవము నుచ్చరించిన శ్రేష్ఠగతిని (పరమ పదమును) జేర్పించుటంబట్టి ఓంకారమనబడును.

అవ॥ ఓంకారమే ప్రళయమనుచున్నాడు –

**మూ॥ ప్రాణాన్ సర్వాన్ ప్రలీయత ఇతి ప్రళయః॥**

ప్రాణములన్నియు (ప్రపంచమంతయు) లయించు స్థానంబగుటం జేసి (ఓంకారము) ప్రళయమనబడును. అనగా ప్రపంచమంతయు (సృష్టియంతయు) ఓంకారమునందుండియే కలిగి దానియందే (ఓంకారము నందే) లయించును.

అవ॥ ప్రణవపదార్థమును దెలియజేయుచున్నాడు :-

**మూ॥ ప్రాణాః సర్వాః పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః।చతుర్ధావస్థిత ఇతి సర్వదేవవేదయోనిః। సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్॥**

సకల ప్రాణములను (ప్రపంచమంతయును) పరమాత్మయందు జేర్పించుటంబట్టి ప్రణవమనబడును. నాలుగుపాదములతో గూడియుండుట వలన బ్రహ్మ, విష్ణు, రుద్రాది సకల దేవతలకును, సకల వేదములకును కారణస్థానమై (యోనియై) యున్నది. సకలవాచ్య వస్తువులును (సకల దేవతల నామములును) ప్రణవాత్మక మగును.

అవ॥ ప్రణవమే తారకమని నిరూపించుచున్నాడు:-

**మూ॥ దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖ భయేభ్యః సంతార యతీతి తారణాత్తారకః॥**

సకల దేవతలును ప్రణవస్వరూపమే. సమస్త దుఃఖముల నుండియు సకల భయములనుండియు తరింపజేయునదిగా నుండుటం బట్టి తారణమనబడును. తారణము చేయుటవలన తారకమనబడును.

అవ॥ సకల దేవతలును లయించు స్థానమును జెప్పుచున్నాడు :-

**మూ॥ సర్వే దేవాస్సంవిశన్తి విష్ణుః సర్వాణి బ్రహ్మయతీతి బ్రహ్మ॥**

సకల దేవతలను ఏచోట విశ్రమింతురో ఆచోటు విష్ణువనబడును. అనగా విష్ణుస్థానమైన పరమపదమునందు సకల దేవతలును (ఆ దేవతలచేత సృష్టింపడిన సకలభూతజాలమును) లయమగును. (నివసించు యోగస్థానమగును.) సకల ప్రాణులను (సర్వ ప్రపంచమును) మరల సృష్టించుటం బట్టి బ్రహ్మమనబడును.

అవ॥ ప్రకాశవస్తు విట్టిదని బోధించుచున్నాడు -

**మూ॥ సర్వస్యాన్తస్థానేభ్యో ధ్యేయేభ్యః, ప్రదీపవత్ ప్రకాశయతీతి ప్రకాశః॥**

సకల ప్రాణులయొక్క హృదయస్థానమందు ధ్యానయోగమైన వస్తువును (పరమాత్మను) దీపమువలె ప్రకాశింపజేయునది కావున ప్రకాశమనబడును (ఓంకారమునకు ప్రకాశమనియు పేరు కలదు.)

**మూ॥ ప్రకా శేభ్యస్సదోమిత్యన్తశ్శరీరే విద్యోతయతి ముహుర్ముహు రితి విద్యుత్॥**

సకల ప్రకాశములకును శ్రేష్ఠమైన (పరమప్రకాశమై) మాటి మాటికి శరీరము లోపల (ధ్యానసమయమందు) ఓం అని (మెరుపువలె) ప్రకాశించుటం బట్టి విద్యుత్తు అనబడును.

అవ॥ ప్రణవము సర్వవ్యాపి యనబడుచున్నదని చెప్పుచున్నాడు.

**మూ॥ ప్రతీయాద్దిశం దిశం భిత్వా సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి వ్యాపయతీతి వ్యాపనాద్వ్యాపీ మహాదేవః॥**

సకలదిశలందును లోపల (అంతర్యామియై) ప్రవేశించి, సకల లోకములయందును వ్యాపించుటవలనను, వ్యాపింపచేయుటవలనను వ్యాపి

యనియును మహాదేవుడనియును (పరమాత్మస్వరూపుడనియు) ప్రణవశబ్ద వాచ్యుడైన భగవంతుడు చెప్పబడుచున్నాడు.

అవ॥ ఇదివరకు చెప్పబడిన ప్రణవమునే విస్తరించుచున్నాడు.

**మూ॥ పూర్వాస్య మాత్రా జాగర్తి జాగరితం ద్వితీయా స్వప్నం తృతీయా సుషుప్తిః చతుర్థీ తురీయా మాత్రా మాత్రా ప్రతి మాత్రా గతాః సమ్యక్సమస్తానపి పాదాౕ జనయతీతి స్వయం భవతీ త్యేష సిద్ధాకర ఏతస్మాత్ ప్రకాశః స్వయం ధ్యానాదౌ ప్రయుజ్యతే॥**

ప్రణవము యొక్క మొదటిమాత్ర మేల్కొను టయను జాగ్రత్త, రెండవ మాత్ర స్వప్నము, మూడవమాత్ర సుషుప్తి, నాల్గవమాత్ర తురీయము ఒక్కొక్క మాత్రయు భిన్నమాత్రలయందు లయించును. అనగా అకారము ఉకారమునందును, ఉకారము మకారమునందును, మకారము అర్ధ మాత్రయందును లయమగును. కావున అర్ధమాత్రయందు మకారమును, మకారము నందు ఉకారమును, ఉకారమునందు, అకారమును కలుగును. ఇది స్వయంప్రకాశమైనది. దీనిని వేఱొకటి ప్రకాశింపజేయదు. దీనిని చక్కగా ధ్యానము చేసిన యెడల పూర్వపదములను కలుగజేయును. ఇది స్వయం బ్రహ్మమైయుండుటంబట్టి సిద్ధిని (మోక్షసిద్ధిని) కలుగజేయును. కాబట్టి ఈ ప్రణవము ధ్యానధారణ సమాధులయందు వినియోగింప బడుచున్నది.

అవ॥ తురీయ బ్రహ్మమును నిరూపించుచున్నాడు.

**మూ॥ సర్వకరణోపసంహారాత్ ధార్యధారణాద్బ్రహ్మ తురీయమ్॥**

సకల కరణములను (ఇంద్రియములను) ఉపసంహరించుటవలన (సకలవృత్తులను నశింపజేయుటవలనను, ధరింపదగిన దానిని ధరింప చేయుటవలనను)'వారి వారి పరిపాకమునకు దగినట్లు బ్రహ్మ, విష్ణు, రుద్ర తురీయమూర్తులను ఉపాసింప జేయుటవలనను, బ్రహ్మము తురీయ మనబడును. ఆ ప్రణవము, తురీయము (కారణము) అనబడును.

అవ॥ మున్ను అడుగబడిన ఆరు ప్రశ్నలలో నెయ్యది మొదట ఉపయోగింపబడినది. ధ్యానమేది? ధ్యానింపబడినది యేది? అను నీ

మూటికిని తురీయబ్రహ్మమే యని సూచించి యిప్పుడు ధ్యానము, ధ్యాత, ధ్యేయము అను నీ మూటిని గూర్చి క్రమముగ నుపదేశించుచున్నాడు.

**మూ॥ సర్వకరణాని మనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః॥**

స్థూలశరీరమునందలి దశేంద్రియములను మనస్సునందు చక్కగా నిలిపి ధ్యానించుటయే విష్ణువు. ఇట్లు ధ్యానించు యోగి సాక్షాన్నా రాయణుడని భావము. ధ్యానింపతగినవాడు విష్ణుమూర్తి. అనగా విష్ణుమూర్తినే యోగులు ధ్యానింపవలెనని మరికొందఱనెదరు.

అవ॥ ఇప్పుడు ధ్యాత ఇట్టివాడని చెప్పుచున్నాడు.

**మూ॥ ప్రాణం మనసి సహకరణై స్సంప్రతిష్ఠాప్య ధ్యాతా రుద్రః॥**

సూక్ష్మశరీరమందలి తత్త్వములను, ఇంద్రియములను మనస్సునందు చక్కగా నిలిపి ధ్యానించువాడు రుద్రుడు. ఇట్లు ధ్యానము చేయువాడు రుద్రుడు, అనగా అట్టి యోగి రుద్రుడే యగుచున్నాడు.

అవ॥ ఇపుడు ధ్యేయవస్తువును బోధించుచున్నాడు.

**మూ॥ ప్రాణం మనసి సహకరణైః నాదాన్తే పరమాత్మని సంప్రతిష్ఠాప్య**
**ధ్యాయేతేశానం ప్రధ్యాయితవ్యమ్॥**

ప్రాణమును, ఇంద్రియములను మనస్సునందు జేర్చి నాదాంతమైన పరమాత్మయందు (అర్ధమాత్రకధిదేవతయైన కారణ బ్రహ్మస్వరూపము నందు) చక్కగా నలిపి ఈశానుని ధ్యానము చేయవలయును. విశేషముగా ఆ ఈశానుని (పరమాత్మను) ధ్యానము చేయవలయును.

అవ॥ మీద చెప్పినదానినే దార్ఢ్యము కొరకు మరల జెప్పుచున్నాడు.

**మూ॥ సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేన్ద్రాః తే సంప్రసూయన్తే సర్వాణి**
**చేన్ద్రియాణి సహ భూతైర్న కారణం కారణానాం ధాతా**
**ధ్యాతా కారణన్తు ధ్యేయః సర్వైశ్వర్యసంపన్న స్సర్వేశ్వరః**
**శంభురాకాశమధ్యే॥**

సర్వమును బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాదులు వీరందరును పుట్టు వారలు . సకలేంద్రియములును, సకలభూతములను పుట్టుచున్నవి. వీనికన్నిటికిని కారణమైన వస్తువుమాత్రము పుట్టుట లేదు. అనగా నాశరహితమైనది. ఇట్లు

సకల కారణములకును కారణమైనవాడును, సకలైశ్వర్యములు గలవాడును, సర్వేశ్వరుండును, శంభువును, ఆకాశ మధ్యమందు (సకల చేతనముల హృదయాకాశ మధ్యమందు) వసించువాడును అగు పరమాత్మను ధ్యానింపవలయును. ఆ పరమాత్మయే ధ్యేయ (ధ్యానింపదగిన) వస్తువు.

అవ॥ ధ్యానప్రయోజనమును జెప్పుచున్నాడు:

**మూ॥ ఏవం ధ్యాత్వా క్షణమేకం క్రతుశతస్యాపి చతుస్సప్తత్యా యత్ఫలం తదవాప్నోతి॥**

ఈ ప్రకారము ఒక్కమారు ధ్యానము చేసినవానికి నూరు నూరు యాగములను డెబ్బదినాలుగుమారులు గావించినవానికి నే ఫలము కలుగునో ఆ ఫలము కలుగును.

అవ॥ ఆ ధ్యానమహిమను ప్రణవోపాసకుడే యెరుగుననుచున్నాడు.

**మూ॥ కృత్స్నమోంకారగతిం చ సర్వధ్యాన యోగజ్ఞానానాం యత్ఫలం ఓంకారో వేదవర ఈశో వా॥**

ఓంకారస్వరూపమునంతయు సకల విధములైన ధ్యానములు సమస్త యోగములు, సకలజ్ఞానములు, వీని ప్రయోజనములు అగు వీని నన్నిటిని ఓంకార ధ్యానము చేయువాడే యెరుగును. దానిని పరమేశ్వరుడే యెరుగును. అనగా ఓంకారము నుపాసించువాడే ఓంకారుడనియు, వాడే పరమేశ్వరు డనియును భావము.

అవ॥ ప్రణవశబ్దవాచ్యుడైన పరమాత్మయే యుపాసింపదగినవాడని చెప్పుచున్నాడు.-

**మూ॥ శివ ఏకో ధ్యేయశ్శివంకరః సర్వమన్యత్పరిత్యజ్య; సమాప్తా - థర్వశాఖా॥**

శివంకరుడైన (మోక్షమునొసంగువాడైన) శివుడే (శుభప్రదుడైన పరమాత్మ యొక్కడే) సర్వమును పరిత్యజించి (ఇతరోపాసనలను విసర్జించి) ధ్యానింపదగినవాడు. ఇట్లు అథర్వశిఖోపనిషత్తు సమాప్తమైనది.

అవ॥ ఉపనిషత్పారాయణ ఫలమును బోధించుచున్నాడు.

**మూ॥ఏతామధీత్య ద్విజో గర్భవాసాద్విముక్తో విముచ్యతే। ఏతామ**

**ధీత్య ద్విజో గర్భవాసాద్విముక్తో విముచ్యతే। ఇత్యోంసత్య మిత్యుపనిషత్।**

హరిః ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఈ అథర్వశిఖోపనిషత్తును అధ్యయనముచేయు ద్విజుడు గర్భవాస దుఃఖమునుండి (జననమరణ దుఃఖముల నుండి) విముక్తుడగును. దీనిని పారాయణముచేయు ద్విజుడు జననదుఃఖములనొందనివాడై నిరతిశయానందమైన కైవల్యమును జేరును. ఓం సత్యం అని ఉపనిషత్తు.

ఓం తత్సత్

అథర్వశిఖోపనిషత్తు సమాప్తము.

ఓం

# ఉత్తరగీతా

ఈ ఉత్తరగీత నరనారాయణాంశులై భూలోకమున ధర్మసంరక్షణార్థము అవతరించిన శ్రీకృష్ణార్జునుల ఆత్మోపదేశమైయున్నది. శ్రీ భగవద్గీతను ఉపదేశము పొందిన తరువాత అర్జునుడు ప్రపంచ కార్యములలో మునిగిపోవుటచే కొంత కాలమునకు గీతార్థమును మరిచిపోయెను. అందువలన మరల శ్రీకృష్ణపరమాత్మని ఏకాంతప్రదేశమున శరణుజొచ్చి ఆత్మవిషయము నడిగినప్పుడు ఆయన పరమార్థతత్త్వమును, యోగజ్ఞానములున్ను కలిపి సంగ్రహించి ఉపదేశించిన సారము ఉత్తరగీత యనంబడును. పూర్వ గీతయగు శ్రీభగవద్గీత నుపదేశించిన తరువాత యిది బోధింపబడినందున దీనికి ఉత్తరగీత యని పేరు గలిగెను. శ్రీభగవద్గీతయందు కర్మయోగమును యోగమనియు, కర్మలచే బంధింప బడక యుండెడి అవస్థయే జ్ఞానమనియు బోధించిన పద్ధతిని మాని దీనియందు అష్టాంగయోగమే యోగశబ్దార్థమనియు, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమునే జ్ఞానవాక్యమనియు బోధించిరి. ఇదియే శ్రీభగవద్గీతకును, ఉత్తరగీతకును గల తారతమ్యము. మరియు భగవద్గీత బోధించెడు కాలమున అర్జునుండు నిర్విషయస్థితిని పొందియుండలేదు. మరియు అట్టి కాలమున యౌవనయుక్తుడై యుండెను. అప్పటికి నిష్కామకర్మయోగమే యథార్థమైన సాధనగా నుండవలయును. ఇప్పుడు ప్రాపంచిక విషయములు నశించిన చిత్తముగలవాడై వానప్రస్థాశ్రమమున నేకాంతస్థలమున నుండి యోగాద్య నుష్ఠానములతో బ్రహ్మచింతన చేయు కాలమగుటచే నిత్తరి నిది నిజమైన సాధనగా నుండును. రఘువంశ కావ్యములో వంశమును గురించి చెప్పునప్పుడు:

**శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్॥**
**వార్ధకే మునివృత్తీనాం యోగానాంతే తనుత్యజామ్॥**

అని శ్రీ కాళిదాస మహాకవి వర్ణించినట్లు రఘువంశరాజులు వార్ధక్య కాలమున ముని చర్యతో గూడినవారలై అంత్యకాలమున యోగనిష్ఠలో నుండి

శరీరమును విడిచెడు వారలై యుండిరి. లోతుకు దిగి విచారించిన ఉత్తరగీతయొక్క రహస్యము దీని ననుసరించి యుండునని స్పష్టపడగలదు. దీనియందు హంసయోగము ముఖ్యముగా కాన్పించుచున్నది. సాధన ఓంకారము, తక్కిన సాధనలన్నియు వీటియొక్క అంగములై కనబడుచున్నవి. కావున అంత్యసందేశము ఓంకార మనియు, హంసలయొక్క ఐక్యము అనగా జీవబ్రహ్మైక్య సంధానమే నిష్ఠయనియు, ఏకత్వమైన అద్వితీయ బ్రహ్మాకార స్థితియే పర్యవసానమనియు గోచరించుచున్నది. దీనివలన మునివృత్తి గలవార లకై క్షీణదోషులకై బ్రహ్మానుసంధానపరులకై యీ యుత్తరగీత పరమాత్ము డగు శ్రీకృష్ణ భగవానునిచే బోధింపబడినదని తెలియవచ్చున్నది. ఇది జీవిత దశయొక్క ఉత్తరభాగము. శ్రీభగవద్గీత జీవిత పూర్వభాగములో ఉపదేశింపబ డినది. దీనివలన సర్వజను లున్ను పూర్వగీత యగు శ్రీ భగవద్గీత ఆశయము రీతిగా నిష్కామకర్మయోగ మనుష్ఠించి అంతఃకరణశుద్ధి కలిగిన తరువాత యిట్టి అజప ఓంకారముల ధ్యాన మునకు అర్హులగుదురని తేలుచున్నది.

**ప్రమాదినో బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః**
**సన్న్యాసినోఽపి దృశ్యంతే దేవసన్దూషితాశయాః॥**

శ్రీసురేశ్వరాచార్యు లిట్లు వ్రాసియున్నారు. సన్న్యాసులలో కొందరు చక్కగ గురు శుశ్రూషాది తపశ్చర్యలు చేయనివారగుటచేతను, గురుదైవ శా స్త్రములలో దృఢవిశ్వాసముగలిగి చక్కని అనుష్ఠానము లేనివారగుటచేతను, దేవతల వలన దూషితమైనచిత్తము గలవారై, బాహ్యవృత్తి గలవారై, పైశున గుణ ము గలవారై, కలహోత్సుకులై, ప్రమాదము నొందినవారలై కను పట్టుచున్నారు. కావున శ్రీభగవద్గీతలో చెప్పిన అనుష్ఠానము సంపూర్ణముగ శీలించినవారలే ఈ ఉత్తరగీతలో గల సాధనకు అర్హులగుదురు. మరియు ఈ గీతను గూర్చి మరి యొక గొప్ప మహిమ గలదని సోదర సోదరీ జనులకు తెలుపవలసియున్నది. అదేమనగా వేదముల సారమగు ఉపనిషత్తులలో శిరస్సైన మాండూక్య ఉపని షత్తునకు కారిక వ్రాసిన బ్రహ్మవిద్వరిష్ఠులగు శ్రీగౌడ పాదాచార్యులచే ఈ ఉత్త రగీతకు ప్రప్రథమమున అర్థము వ్రాయబడెను. శ్రీగౌడపాదాచార్యులు శ్రీజగద్గురు శ్రీశంకరభగవత్పాదాచార్యుల గురోర్గురువు. అనగా భగవత్పాదా

చార్యులకు గోవింద భగత్పాదాచార్యులు గురువు. వీరి ఆచార్యులు శ్రీ గౌడపాదాచార్యులు. అట్టి మహనీయులు దీనికి అర్థము వ్రాసినప్పుడు ఉత్తరగీత మహిమ తేటతెల్లమగుచున్నది. మాండూక్యోపనిషత్తు సంపూర్ణముగా ప్రణవోపాసననే చెప్పుచున్నది. ఈ ఉత్తరగీతలో నుండే ఓంకార భావమును మాత్రమే ఈ వ్యాసముతో చేర్చతలచితిని. ఇది వేదాంత శ్రవణ పూర్వక ధ్యానయోగ మగును. ''వేదాంతశ్రవణం కుర్వన్యోగం సమారభేత్'' అను నుపనిషద్ వాక్యానుసారముగా ధ్యానయోగము శ్రేష్ఠతమమని తేలుచున్నది. శ్రీ జగద్గురు శంకరభగవత్పాదాచార్యులు ప్రాణాయామాది కొన్ని ఆసనములను బహిరంగ సాధనగా నంగీకరించి, శ్రవణ మనన నిదిధ్యాసనాదులను అంతరంగ సాధనలుగా గ్రహించి ధ్యానయోగమున కెక్కువ ప్రాశస్త్య మొసంగి యున్నారు. ప్రాణాయామాది కొన్ని యోగసాధనలు లేనిచో నింద్రియ శుద్ధియు, మనోనిగ్ర హమును, చిత్తైకాగ్రతయు సిద్ధింప ప్రయాసముగా నుండును. ఆధ్యాత్మ విషయక గ్రంథములన్నియు ధ్యానయోగమున కగ్రస్థానము నొసంగి యున్నవి.

**అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ।**
**సుషుమ్నాధ్యానయోగస్య కలాం నార్హంతి షోడశీమ్॥**

సహస్ర అశ్వమేధములును, వాజపేయ అను పేరుగల నూరు యజ్ఞములును చేసిన ఫలమేదిగలదో అది ధ్యానయోగము యొక్క పదునారింటిలో ఒక్క భాగమునకు సరిపోజాలదు.

**అనేకయజ్ఞ దానాని వ్రతాని నియమా స్తథా।**
**సుషుమ్నాధ్యానయోగస్య కలాం నార్హంతి షోడశీమ్॥**

అనేకములగు యజ్ఞములున్ను, దానములున్ను, వ్రతములున్ను, నియమానుష్ఠానములున్ను సుషుమ్నాంతర్గత ధ్యానయోగముచే కలిగెడు షోడశభాగములలో ఒక్క భాగమునకు సరిపోజాలవు.

**యథాఽగ్నిర్దారుమధ్యస్థో నోత్తిష్ఠే న్మథనం వినా।**
**వినా చాభ్యాసయోగేన జ్ఞానదీప స్తథా న హి॥**

కర్రలో నిగూఢమైయుండు అగ్ని మథనము వినా యేలాగున జ్వలింపజాలదో, అలాగున ఆత్మానాత్మవిచారపరమగు ధ్యానయోగము వినా

తనలో నిగూఢమైయుండు జ్ఞానాన్ని ప్రజ్వలింపజాలదు. అరణినుండి తీయబడిన అగ్నిచే హోమకుండములో గల సమస్తవస్తువులు ఏలాగున భస్మము చేయబడుచుండునో, ఆలాగున జ్ఞానజ్యోతి అనగా ఆత్మైక్యబోధము కలుగునప్పుడే, సమస్తకర్మ లను కట్టెలు దగ్ధమగును.

**ఘటమధ్యే యథా దీపో బాహ్యేనైవ ప్రకాశతే।**
**భిన్నే తస్మిన్ ఘటే చైవ దీపజ్వాలా చ భాసతే॥**

ఘటము లోపలనుండు దీపము ఏలాగున ఘటావరణముచే ప్రకాశింపదో, ఘటమును పగులగొట్టినప్పుడు దీపమేలాగున శుద్ధముగా ప్రకాశించునో, అదేరీతిగా అనాత్మభ్రాంతియగు దేహ ఘటముచే ఆవరింపబడిన స్వరూపజ్ఞానమును సాక్షాత్కరించుటకు గురూక్త ఆత్మైక్యబోధదండముచే అనాత్మ భ్రాంతియగు ఘటమును ధ్వంసము చేసినమాత్రమే జ్ఞాన జ్యోతిని దర్శింపగలుగుదురు.

**స్వకాయం ఘటమిత్యుక్తం యథా దీపో హి తత్పదమ్।**
**గురువాక్యసమాభిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే॥**

తన యొక్క కాయమే ఘటమనియు, జ్ఞానదీపము తత్పదమగు బ్రహ్మమనియు, గురువాక్యమే దండమనియు, వైరాగ్యానుతాడనమే ఘటమును భిన్న మొనర్చుట యనియు గ్రహించవలయును.

**కర్ణధారం గురుం ప్రాప్య తద్వాక్యం ప్లవవద్దృఢమ్।**
**అభ్యాసవాసనాశక్త్యా తరంతి భవసాగరమ్॥**

సాగరము దాటతలంచువారికి దృఢమైన నావయు, మంచి నేర్పరియగు కర్ణధారుడు, అనగా దాటించువాడును ఎట్లత్యవసరమో ఆలాగున సంసారమనెడు సాగరమును దాట తలంచువారికి మహాత్ముడగు గురువు అను కర్ణధారుడున్ను, దృఢాభ్యాసమగు అనుష్ఠానమున్ను ఉండియే తీరవలయును. అట్టయిన నిర్భయముగాను, సులభముగాను భవసాగరమును దాటి నిత్యానందపదవిని బొందవచ్చును. ఇప్పుడు ఓంకారమును గురించి ఉత్తరగీత చతుర్థాధ్యాయమున చెప్పబడిన రీతిగా క్రింద వ్రాయబడుచున్నది.

## చతుర్థాధ్యాయము

అర్జున ఉవాచ:-

**ఓంకారస్య తు మాహాత్మ్యం రూపం స్థానం పరం తథా।**

**తత్సర్వం శ్రోతుమిచ్ఛామి బ్రూహి మే పురుషోత్తమ! ॥** 1

పురుషశ్రేష్ఠుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ! ఓంకారము యొక్క మాహాత్మ్యము, రూపము, స్థానము మొదలగు విషయాలన్నింటిని విన వలయునను కోరిక గలదు. కావున నాకు చెప్పవలయును అని అర్జునుడు శ్రీకృష్ణమూర్తినడిగెను.

శ్రీ భగవానువాచ :-

**సాధు పార్థ! మహాబాహో! యన్మాం త్వం పరిపృచ్ఛసి।**

**విస్తరేణ ప్రవక్ష్యామి తత్తే నిగదితం శృణు॥** 2

దీర్ఘ భుజములుగలవాడవును, కుంతీపుత్రుడవునగు ఓ అర్జునా! నీవడిగిన ప్రశ్న చాల మంచిది. ఇందులకు సమాధానమును స్పష్టముగ విస్తరించి చెప్పెదను, (సావధానుడవై) వినుము.

**పృథివ్యగ్నిశ్చ ఋగ్వేదో భూరిత్యేవ పితామహః।**

**అకారే తు లయం ప్రాప్తే ప్రథమే ప్రణవాంశకే॥** 3

ప్రణవము యొక్క ప్రథమభాగమగు అకారము లయమును పొందగా, భూమియు, అగ్నియు, ఋగ్వేదమును, భూలోకమును, బ్రహ్మయు పుట్టుచున్నవి.

**అంతరిక్ష యజుర్వేదౌ భువో విష్ణుస్సనాతనః।**

**ఉకారే తు లయం ప్రాప్తే ద్వితీయే ప్రణవాంశకే॥**

ప్రణవము యొక్క ద్వితీయభాగమగు ఉకారము లయమును పొందగా అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము, సనాతనుడైన విష్ణువును (పుట్టుచున్నారు).

**ద్యౌస్సూర్యస్సామవేదశ్చ స్వరిత్యేవ మహేశ్వరః।**

**మకారే తు లయం ప్రాప్తే తృతీయే ప్రణవాంశకే॥** 5

ప్రణవముయొక్క తృతీయ భాగమగు మకారము లయమును పొందగ ద్యులోకము, సూర్యుడు, సామవేదము, స్వర్లోకము, మహేశ్వరుడు (పుట్టుచున్నారు.)

**అకారః పీతవర్ణశ్చ రజోగుణసముద్భవః।**
**ఉకారశ్శుక్లవర్ణశ్చ సత్త్వగుణ సముద్భవః।**
**మకారః కృష్ణవర్ణశ్చ తమోగుణసముద్భవః॥** 6

అకారము పచ్చనివర్ణము గలది. రజోగుణమువలన పుట్టినది. ఉకారము తెల్లని రంగుగలది. సత్త్వగుణమువలన పుట్టినది. మకారము నల్లని రంగు గలది. తమోగుణమువలన పుట్టినది.

**అకారే చ ఉకారే చ మకారే చ ధనంజయ!।**
**ఇదమేకం సునిష్పన్నమోమితి జ్యోతిరూపకమ్॥** 7

అర్జునా! అకార ఉకార మకారములను మూడు వర్ణములు జ్యోతిస్వరూపమగు 'ఓం' కారమునుండి పుట్టెను.

**త్రిస్థానం చ త్రిమాత్రం చ త్రిబ్రహ్మ త్ర్యక్షరం తథా।**
**త్రిమాత్రమర్ధమాత్రం చ ప్రణవస్య విశేషతః॥** 8

**అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్।**
**ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః॥** 9

ప్రణవము యొక్క స్థానత్రయమును, మాత్రాత్రయమును, బ్రహ్మత్రయమును, అక్షరత్రయమును, త్రిమాత్రలను, అర్ధమాత్రను, మరియు అష్టాంగములను, పాదచతుష్టయమును, స్థానత్రయమును, దేవతాపంచకమును ఎఱుంగవలయును. ఇట్టి ఓంకారము లెఱుంగని బ్రాహ్మణుడు బ్రాహ్మణశబ్దమున కర్హుడు కాడు.

**ఓమిత్యేవ పరం రూపం పరం బ్రహ్మ ప్రవర్తితమ్॥** 10
**ఓంకారే తు ప్రవిష్టోఽహం ప్రభవః ప్రళయస్తథా।**
**ప్రణవే సర్వగం దేవమేకీకృత్య సమభ్యసేత్॥** 11

''ఓం'' అను అక్షరము సర్వోత్తమమయిన రూపము గలది. అదియే

పరబ్రహ్మము. నేను ఓంకారమునందు ప్రవేశించి యున్నాడను. ఆ యోంకారమే జగత్ప్రళయకరమును, తజ్జనకమును అగుచున్నది. అట్టి ప్రణవమునందు అంతటా నిండియున్న దేవుని ఏకీభవింపజేసి అభ్యసింపవలయును.

**భూర్భువస్స్వోతి మంత్రేణ శరీరం పరిశుద్ధ్యతే॥**
**శరీరప్రణవం ధ్యాయేత్సర్వాజ్ఞానవివర్తకమ్॥ 12**

మనుష్యుడగువాడు ''భూర్భువస్స్వః'' అను మంత్రమును ధ్యానించుటవలన దేహము పరిశుద్ధమైనది అగును. ప్రణవమును ధ్యానించుటవలన సకల అజ్ఞానము నశించుపోవును.

**రేచకశ్శ్వాసనిశ్వాసః పూరకః పరిచక్ష్యతే।**
**తద్రోధః కుంభకశ్చైవ ప్రాణాయామస్స ఉచ్యతే॥ 13**

ప్రాణవాయువును వెలుపలికి విడుచుట ''రేచక'' మనియు లోపలికి పీల్చుట ''పూరక'' మనియు, ఆ ప్రాణవాయువును లోనికి వెలుపలకు పోనీయక నిలిపి యుంచుట ''కుంభక'' మనియు, ఈ రేచక, పూరక, కుంభకముల నాచరించుటయే ప్రాణాయామ మనియు తెలిసికొనవలయును.

**ప్రణవస్య శిరో హ్యాత్మా తల్లక్ష్యం బ్రహ్మ ఉచ్యతే।**
**అప్రమత్తస్స వేద్ధవ్యం శరవత్తన్మ యోచ్యతే॥ 14**

శిరస్సుతోకూడిన ప్రణవము బ్రహ్మమగును. ప్రణవమునకు లక్ష్యమే బ్రహ్మము. బాణసంధానము చేయునపుడు లక్ష్యమునందు ఎమరుపాటు లేక యెటుల దృష్టిని నిలుపుదురో అటులే ఆ బ్రహ్మమునందును దృష్టిని నిలుపవలయును.

**నివర్తన్తే క్రియాస్సర్వా స్తస్మిన్దృష్టే వరావరే।**
**ఓంకారప్రభవా వేదా ఓంకారప్రభవాస్స్వరాః॥ 15**

ఓంకారవాచ్యుడును, కార్యకారణరూపమును నగు ఆ పరమాత్మ నెఱుంగగా సమస్తక్రియలు నిలిచిపోవుచున్నవి. వేదములు, స్వరములు ఇవి యన్నియు ఓంకారమువలననే పుట్టినవి.

**ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్।**
**ఓమిత్యేవ వరం రూపం హృత్పద్మే చ వ్యవస్థితమ్॥ 16**

చరాచరాత్మకమగున ఈ లోకత్రయము ఓంకారమువలననే పుట్టినది. హృదయకమలమునందు ''ఓమ్'' అను అక్షర స్వరూపము గలదు.

**తస్మాత్తదభ్యసేదేకం సర్వగం పరమేశ్వరమ్।**
**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్ష ప్రదాయకః॥ 17**

కావున అంతట వ్యాపించియుండునదియు పరమేశ్వర స్వరూపమును, ఒక్కటియునగు ప్రణవమునే అభ్యసింపవలయును. ఆ ప్రణవము హ్రస్వమగు నెడల పాపముల దహించును. దీర్ఘమగు నేని మోక్షదాయక మగును.

**అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద స వేదవిత్॥**
**ఓంకార ప్రభవో విష్ణు స్త్రినేత్రో వచసాం పతిః॥ 18**

చెప్పనలవికాని ప్రణవార్థము నెవడెఱుంగునో వాడే వేదవిదుడు. విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఈ త్రిమూర్తులు ఓంకారమునుండి పుట్టినవారలే.

**తస్యోచ్చారణమాత్రేణ పరబ్రహ్మాధిగచ్ఛతి।**
**ధ్రువమన్నమయం రూపం తద్దేహే సమధిష్ఠితమ్॥ 19**

ప్రణవము నుచ్ఛరింపగనే పరబ్రహ్మమును పొందుచున్నాడు. శాశ్వతమును అగ్నిమయము నయిన ప్రణవము వాని యందున్నది.

**ఇంద్రియాణి పశూన్ హత్వా ఆత్మనైవ తు తుష్యతి।**
**హృత్పద్మకర్ణి కామధ్యే శుద్ధం దీపశిఖాకృతిమ్।**
**అంగుష్ఠమాత్రమచలం ధ్యాయేదీశ్వరమవ్యయమ్॥ 20**

ఇంద్రియములను పశువుల చంపి ఆత్మచేతనే సంతుష్టుడై యుండును. హృత్పద్మకర్ణికయొక్క మధ్యభాగమునందు పరిశుద్ధ మయినదియు, దీపశిఖతో సమానమైన ఆకారము గలదియు, అంగుష్ఠ మాత్రమైనదియు, చంచలము కానిదియు, నాశరహితమునగు ఈశ్వరరూపమును ధ్యానించుచుండవలయును.

**హృదయకమలమధ్యే దీపవద్వేదసారం**
**ప్రణవమయమతర్క్యం యోగిహృద్ధ్యానగమ్యమ్।**
**అజహరిశివయోగం సర్వభూతస్థమేకం**
**సకృదపి మనసా మాం ధ్యాయతే యస్స ముక్తః॥ 21**

హృదయకమలమధ్యమునందు దీపమువలె ప్రకాశించువాడును. వేదములయొక్క సారస్వరూపుడును, ప్రణవస్వరూపుడును, ఊహించుటకు శక్యము కానివాడును, యోగులచేత ధ్యానింపబడిన పిదప వారి హృదయము లందు గోచరుడగువాడును, బ్రహ్మ విష్ణు శివ స్వరూపుడును, సకల భూతము లయందుండువాడును, అద్వితీయుడును అగు నన్ను ఒక పర్యాయమైన నెవడు ధ్యానించుచున్నాడో వాడు ముక్తుడగుచున్నాడు.

**ఇడాయాం వాయుమారోప్య పూరయిత్వోదరస్థితిమ్।**
**తతోఽగ్నిం దేహమధ్యస్థం ధ్యాయేజ్జ్వాలావళీవృతమ్॥ 22**

ఉదరమందున్న వాయువును పూరించి ఇడానాడియందు ఆరోపించి దేహమధ్యభాగమందు జ్వాలాసమూహలముతో పరివేష్టింపబడియున్న అగ్నిని ధ్యానించవలయును.

ఇది ఉత్తరగీత చతుర్థాధ్యాయమందు ఓంకారమును గురించిన భాగము సమాప్తము

★★★★

ఉత్తరగీతలోని ధ్యానయోగమహిమను ఈ క్రింద పొంద పరచుటతో ముముక్షువులకు ధ్యానయోగములో గల మహిమ సువ్యక్త మగును.

**ఆత్మమంత్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్।**
**యోగేన గతకామానాం భావనా బ్రహ్మ చక్షతే॥**

ఆత్మ మంత్రమునకును, హంసకును ప్రతిపాద్య ప్రతిపాదక భావసం బంధ ముండుటవలన (ఆత్మతత్త్వ విచారమైన) యోగముచేత కామాదులు లేనివారి యొక్క భావన తత్త్వమస్యాది మహావాక్యజన్య చరమవృత్తి బ్రహ్మ మనబడును.

విశేషార్థము: ఆత్మయందు తాత్పర్యమై లయించు ప్రణవ స్వరూపము ఆత్మమన్త్రము. తనయొక్క తత్త్వజ్ఞానముచేత జ్ఞాతృ సంసారములను నశింపజే యునది హంస యనబడును. చెప్పబడునది ప్రతిపాద్యము. చెప్పునది ప్రతిపాద కభావము, అనగా చెప్పునది ఆత్మమంత్రము, ఇదే సోఽహమనబడును. చెప్పబడునది హంసము అంత్యవృత్తి చరమమనబడును. చరమవృత్తియొక్క నివృత్తియే బ్రహ్మమనబడును. అనగా అంత్యసందేశము, హంస మంత్రము

ప్రణవములో లయమై ప్రణవము యొక్క నాల్గవ పాదమున నిలుచుటయే ప్రకృతియొక్క వికృతిలేని సాక్షాత్ స్వరూపమని తెలియ వలయును.

**శరీరిణామజస్యాంతం హంసత్వం పారదర్శనమ్।**
**హంసోఽహం సాక్షరం చైతత్ కూటస్థం యత్తదక్షరమ్।**
**తద్విద్వానక్షరం ప్రాప్య జహ్యాన్మరణ జన్మనీ॥**

జీవులకు జీవత్వావధిస్వరూపమైన హంసత్వము (జీవన్ముక్తత్వము) పరబ్రహ్మసాక్షాత్కార మనబడును. హంస (బ్రహ్మ)మును హంసాక్షర (ప్రణవ)మును, నాశరహితమై యుత్తమమైన కూటస్థుని జ్ఞానియైనవాడు పొంది జనన మరణములనుండి విడువబడినవాడగుచున్నాడు.

విశే: ఆముక్తియును జీవబ్రహ్మములయొక్క ఐక్యమునే ప్రతిపాదించుచున్నది. అనగా దీనియందు 4 విధములగు సాధనలు కనబడు చున్నవి.

1.సోఽహం. 2. హంసోఽహం 3. ఓంకారము. 4. శివోఽహం. వీనిలో బ్రహ్మాఽస్మి అనునదిగూడ అంతర్భూతము. వీటియొక్క వాచ్యమును విడిచి లక్ష్యమును పొందవలయును. అనగా శబ్దరహితమై వస్తు స్వరూపము మాత్రమై నిలువవలయునని భావము. క్రింది శ్లోకము నిరంతరము ఆత్మానుసంధానపరులైనవారి చిత్త వృత్తిని గూర్చి చెప్పుచున్నది.

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్।**
**అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద స వేదవిత్॥**

ఎడతెగని తైలధారవలెను, దీర్ఘంబైన ఘంటాధ్వనివలెను విచ్ఛేదరహితంబైనదై, వాక్కునకు అందరానిదై యుండు లక్ష్యార్థ నిర్ణయ బ్రహ్మ స్వరూపంబైన ప్రణవంబు నెవ్వడెఱుంగునో వాడే వేదవేత్త యనం బడును. అనగా ధ్యాన మెడతెగని తైలధారవలెను, ప్రణవము దీర్ఘోచ్చారణము చేసి ఘంటానాదము లయమొందునట్టు మనస్సును, ప్రాణవాయువును, ఓంకార నాదమును స్వరూప ధ్యానములో లయపరచవలయును. ఓంకార ధ్యానము హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని త్రివిధము. సాధారణముగా హ్రస్వ దీర్ఘములనే వాడెదరు. ఆహ్రస్వము, ఆ దీర్ఘమును ఈలాగున ఇ- ఈ, ఉ- ఊ, హ్రస్వ దీర్ఘములని తెలియందగినది. దీర్ఘాక్షరమును ఆరుసార్లు ఉచ్చరించుటకు

ఎంత సమయము పట్టునో అది ప్రణవముయొక్క సామాన్య ధ్యానమగును. క్రమక్రమముగా వృద్ధి పరచి పండ్రెండుసార్లు ఉచ్చరించే కాలము ఒక్క ఓంకారము ధ్యానించుట యగును. ఇది పూర్ణధ్యాన మనం బడును. ధ్యానించువారు వాచ్యములో మనస్సునుంచక సంపూర్ణముగా లక్ష్యములో ఐక్యము నొంద వలయును. ధ్యానము యొక్క పద్ధతి మరియొక విధముగా క్రింద చెప్పబడుచున్నది. ముందు జెప్పిన శ్లోకములు హంసమును గురించినవి. ఇప్పుడు చెప్పు శ్లోకములు తైలధార మొదలు ప్రణవమునకు సంబంధిచినవని తెలియవలయును.

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్।**
**ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్॥**

ఆత్మను అధరారణిగను, ప్రణవరూపంబగు పర బ్రహ్మమును ఊర్ధ్వారణిగను భావించి, ధ్యానంబనియెడి నిర్మథనాభ్యాసంబుచే నతిగూఢంబై వర్తించునట్టి పరమాత్మను జూడవలయును.

ఈ శ్లోకములో "ఆత్మ యెచ్చట కనుపడలేదే?? ఆత్మ ఒక వస్తువుగా నుండిన నేల కనబడదు?" అనెడి సామాన్యజనుల ప్రశ్నకు సమాధానము చెప్పబడెను. అరణియనగా యాగాగ్నికొరకు అమర్చెడు ఒకవిధమగు కొయ్య పేరు. ఇచ్చట ఆత్మశబ్దమును జీవునిగాను, ప్రణవశబ్దమును పరబ్రహ్మమునుగా నెరుంగవలెను. నిరంతరధ్యానము మథనమనంబును. కట్టెలో అ ప్రత్యక్షముగా నుండు నిప్పు, కట్టెను తరచుటచే ప్రత్యక్షమగునట్లు, ఆత్మాను సంధాన–ఐక్యధ్యానము, విచారణ, జ్ఞానపూర్వకముగా చేయునప్పుడు ఆత్మ సాక్షాత్కారము గలుగును. దీనియందు మరియొక రహస్యము గలదు. బాగు గా ఎండిన కొయ్యను తరచిన మాత్రమే అగ్ని ప్రజ్వలించును. గాని పచ్చికొ య్యయైన ప్రయత్నము సఫలీకృతము కానట్లు నిర్విషయస్థితి పొందిన హృదయములోనే ఆత్మైక్యానుభవము గోచరించును. తక్కినవారికి కాలాం తరముచేతనే అనుభవమునకు వచ్చును. ఇక ధ్యానయోగముయొక్క యుత్కృష్టత చెప్పబడును.

**ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్॥**

జ్ఞానసాధనానుష్ఠానమైన యోగము ఏకాగ్ర మనస్సుతోడ నొక ముహూర్తమాత్రంబైనను (తత్త్వజ్ఞానంబు కొరకు) నాసాగ్రమందు నిశ్చల దృష్టితో నిలుపుట యనునదియే ఖేచరీముద్ర యనంబడును. అట్టి ఖేచరీ ముద్ర గలవాడు అనేక జన్మార్జితంబులైన సకలవిధ పాపములనుండి విడివడును.

ఇచ్చట అభ్యాసి స్థూలభ్రూమధ్యంబును అవలంబించి క్రమముగా సూక్ష్మభ్రూమధ్యము నొందవలయును. అది త్రిపుటుల ఐక్యస్థానమగును. అనగా సాక్షాత్ స్వరూపమే తెలియందగినది. ఒక వనములో బహుకాలము నుండి పడియుండుమ్రానులు అగ్నియొక్క రవ్వ తగిలిన వెంటనే ఎట్లు భస్మమై పోవునో, అదేరీతిగా జ్ఞానము కలిగిన వెంటనే కర్మ కట్టెలన్నియు దహించును.

**జపేద్వర్ష సహస్రాణి ఏక పాదస్థితో నరః।**
**ఏకస్య ధ్యానయోగస్య కలాం నార్హతి షోడశీమ్॥**

ఒకడు ఏకపాదమందు నిలిచి పెక్కు వేలయేండ్లుచేసిన తపస్సు ఒక ధ్యానయోగము యొక్క కలలో బదియారవ యంశంబునకు సమానంబు గాదు.

**బ్రహ్మహత్యా సహస్రాణి భ్రూణహత్యా శతాని చ।**
**ఏకో హి ధ్యానయోగశ్చ దహత్యగ్ని రివేంధనమ్॥**

సహస్ర బ్రహ్మహత్యలును, అనేక భ్రూణహత్యలును ఒక ధ్యానయోగముచే దహించును. ఎట్లన? కొండంత కట్టెలు గోరంత నిప్పుచే భస్మమగును గదా!

**సర్వత్రావస్థితం శాంతం న ప్రపశ్యేజ్జనార్దనమ్।**
**జ్ఞానచక్షుర్విహీనత్వాదంధస్సూర్యమివోదితమ్॥**

అంధుడు సూర్యోదయంబును జూడనేరని భంగి, జ్ఞానచక్షుర్వి హీనుడు సర్వపరిపూర్ణ బ్రహ్మంబును గానజాలడు.

ఈ శ్లోకమువలన సాధారణ నేత్రములుగాక జ్ఞాననేత్రమని మరి యొకటి గలదని తేలుచున్నది. శ్రీ భగవద్గీత 11-వ అధ్యాయములో కృష్ణభగవానులు అర్జునుని కొరకు విశ్వరూపమును జూపినప్పుడు ఈతత్త్వమునే తెలిపియున్నారు. మాంసచక్షుస్సుచేత విశ్వరూపమునుజూడ శక్యము